


జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖీ ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతీమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్ :
సి. సి. పున్నయ్య


# స్త్రీలు — ఉద్యోగాలు



దేశంలో విద్యావంతులలో నిరుద్యోగం విస్తారముగా కనుపించుచున్న ప్రస్తుత పరిస్థితులలో స్త్రీలలో సయితము కలదనడములో ప్రత్యేకత కనుపించదు. స్త్రీలు పురుషులుకూడ ముమ్మాటికి సమానహక్కులతోబాటు బాధ్యతలను సయితము వహించవలసియున్నది. అయితే స్త్రీలు సుకరముగా, అనుకూలముగా నిర్వహించగల అనేక బాధ్యతలుండగా పురుషులు చేస్తున్న ప్రతిపనిని చేయాలనటం అనవసరమనిపించుకుంటుంది. జాతీయ సౌభాగ్యము నుద్దేశించి స్త్రీ పురుషులు అనుకూలముగా ఉమ్మడి బాధ్యతలను పంచుకొని నిర్వహించుట వాంఛనీయము.

అఖిలభారత మహిళాసమావేశంలో అధ్యక్షపీఠమునుండి శ్రీమతి రక్షాశరణ్ దేశపునర్నిర్మాణ కార్యక్రమంలో స్త్రీలకు సమానావకాశము లివ్వాలన్నారు. దానికంటె నిర్దిష్టమైన లక్ష్యంతో విద్యాభ్యాసముచేసి సుశిక్షితులై వైద్య, విద్యా,

వైజ్ఞానిక, సాంఘిక రంగాలలో గురుతరమైన బాధ్యతలను నిర్వహించవలసియున్నదని ఉద్బోధించవలసియున్నది.

పారిశ్రామిక, వ్యవసాయరంగాలలో సయితము స్త్రీల సహజ సౌకుమార, ఆరోగ్యములకు భంగముకలుగని బాధ్యతలను ప్రత్యేకించుట, మిగిలినవానిని పురుషులకు ప్రత్యేకించడం అత్యవసరం.

సౌభాగ్యవంతమైన సంఘజీవితము స్త్రీపురుషుల లక్ష్యమైయుండాలి. అందుకుగాను కుటుంబ సౌభాగ్యము ప్రధానము. దానినుద్దేశించి గృహనిర్వహణ శాస్త్రమును ప్రతి స్త్రీ అభ్యసించి ఆచరణలో పెట్టవలసియున్నది. కాబట్టి శ్రీమతి రఘావీరన్ విద్యార్థిదశలో నిట్టి శిక్షణ అత్యంత ఆవశ్యకమనియు, దేశమంతటా విశ్వవిద్యాలయాలలో గృహనిర్వహణ విజ్ఞానశాస్త్ర B. Sc కోర్సు ప్రవేశపెట్టి నిర్వహించవలసియున్నదనియు ఉద్బోధించారు.

గృహనిర్వహణ విజ్ఞానశాస్త్ర విజ్ఞానము పట్టణములలోను పల్లెపట్టులలోను కూడ విస్తరించవలసియున్నది. కుటుంబ ఆరోగ్యసౌభాగ్యాలు గృహనిర్వహణ విజ్ఞానంమీదనే ఆధారపడియున్నవి. వానిని విస్మరించిననాడు ఏ రంగంలోను అభివృద్ధి అభ్యుదయాలు సమకూరవు.

జాతీయ రంగంలో స్త్రీ పురుషులు ఉద్యోగాలకని పోటీపడటం వాంఛనీయము కాదు. ఉభయులలో నెవరు నిరుద్యోగులైనా కుటుంబమునకు నష్టమే కాగలదు. ఉభయులు విద్యావంతులై సమానహక్కులతోటి, సమానావకాశములు కోరునప్పుడు గురుతరమైన బాధ్యతలను సయితము గుర్తించి పరస్పర సహకార సద్భావములతో మెలగినచో స్త్రీ పురుషులిరువురు పురోగమనాన్ని ప్రోత్సహించగలరు. హక్కుల కొరకు ప్రాకులాడుతూ, వాస్తవికతను గుర్తించకుండా బాధ్యతలను విస్మరిస్తే సంఘజీవితము కుంటుపడగలదు.

స్త్రీ పురుషుల నిరువురను జాతీయ అభ్యుదయ శక్తులుగా రూపొందించగల విద్య, విజ్ఞానం, సుశిక్షణ యీనాడత్యవసరము.



# చిన్నబోయిన రచ్చబండ

శ్రీమతి కమలాగిరిధర్



ఊళ్లోని పెద్దలందరూ సాయంత్రం మామూలుగా రచ్చబండ దగ్గరకు చేరుకున్నారు. గ్రామమునసబు చెంగయ్యనాయుడూ, కరణం పిచ్చయ్య, పెద్దరైతు సుబ్బారాయిడూ - యిత్యాదులు యీవేళ కాస్త ముందుగానే వచ్చి కూర్చున్నారు. ఇంకా అక్కడికి చేరుకోవాల్సిన వాళ్లలో అవధాన్లు ఒకరుండి పోయ్యారు మిగిలి. ఆయనలేందే సమావేశానికి అందంలేదేమో అనిపిస్తుంది. అంటే అంతసందడిగా, అంతధాటీగా మాట్లాడుతాడన్నమాట. సుబ్బారాయుడు మాట్లాడగలడని పేరేగాని, ఆయన బుర్రమీసాలు అవీ ఎగదోసుకొంటూ మాట్లాడేసరికి జాము సేపు పడుతుంది.

అవధాన్లు వెనక రెండోసీటు పిచ్చయ్య కివ్వడమే సబబుగా వుంటుంది. ఆయనకున్న వొకాబ్యులరీ, సున్నితహాస్యమూ వాళ్లలో ఒక్కరికీ - చివరికి అవధాన్లకుకూడా లేదు. అబ్బో ఏం చమత్కారం!! జీవంలేని చిత్తసంగతినైనా తీసుకొని పసగల్లేటట్లు చమత్కరించేస్తాడు. ఎన్ని హంగులున్నప్పటికీ వీళ్లలో ఏ వొక్కరూ రాకపోయినా సభంతా చిన్నబోయినట్లుంటుంది.

ఆవేళ చర్చ మొదలుపెట్టున్నారనగా అవధాన్లు కూడా హుటాహుటిగా అక్కడికి చేరుకున్నాడు. ఒక్క చిటికపొడుం గట్టిగాపీల్చేసి రచ్చబండమీద ఉపవిష్ణుడయ్యాడు. ఆవేళ ఆయనగారి ధోరణిచూస్తే ఏదో పెద్దవిశేషం మోసుకొచ్చినట్టుగా వుంది.

అవధాన్లుగారి ముఖకవళికల్లో గూడార్థం కనుక్కోవడంలో పిచ్చయ్యదే పైచేయి. అవధాన్లువైపు మొహంపెట్టి "ఏమిటో తెచ్చారే" అన్నాడు.

అవధాన్లు మొహం కోపంతో నిండిపోయి వుంది. ఆ కోపంలో నిస్పృహ సూచాయగా కన్పిస్తుంది. అవధాన్లు వీడిపోయిన జుట్టును ముడివేసుకొంటూ "పాపం పెరిగిపోతుందర్రా. ఎవర్నీ నమ్మడానికి లేదు ఈరోజుల్లో. కళ్లెదుటే దుమ్ము కొడుతుంటే మదీనూ".

ఆవేశపడుతున్నాడు అవధాన్లు. అందరూ తెల్లబోతూ సస్పెన్సులో మునిగిపోయారు పిచ్చయ్యతో సహా.

"ఏందయ్యా అవధాన్లూ! కొంచెం సరిగాచెప్పయి స్తరించి" అన్నాడు సుబ్బరాయుడు తెల్సుకోవాలనే ఉత్సాహంతోటి. అవధాన్లు "ఏముంది నా పిండాకూడు. ఆ చెరువు గట్టుమీదకెళ్లి చూడండర్రా. ఆ దృశ్యం చూడలేక కళ్లుమూసుకు చక్కా వచ్చాను" అన్నాడు.

"ఏమిటేమిటీ? ఆ కంసాలి సుబ్బయ్యేనా?" పిచ్చయ్య రాయి సరిగా తగిలింది.

"వాడొక్కడే ఏమిటిలెద్దూ. అందరందరే. దానికైనా సిగ్గుండొద్దూ? ఏంకాలం వచ్చి పడిందిరా బాబూ."

మునసబు కొంచెం ముందుకు జరిగి "అయితే ఈ విషయమేమిటో తేల్చాల్సినట్టే వుంది" అన్నాడు.

"ఆఁ ఏంజేస్తారండి. మొన్న వీరాస్వామిని ఏం జేశారు? అంతేచేస్తారు" అన్నాడు కసిగా అవధాన్లు.

"అదెలా సాధ్యపడుతుంది. ఈసారి తాత్సారం పనికిరాదు. ఇంతకూ మీరనేది ఆ సుబ్బయ్య సంగతేనా?" అన్నాడు నాయుడు.

"వాడేనండీ ఇంకెవరు? ఆ కనకమ్మతో సరిపెట్టుకుంటాడనుకొంటే — ఇప్పుడా లక్ష్మితోగూడా..."

"ఏమిటీ-రామయ్య కూతురుతోనా. హరిహరీ" తెల్లబోయాడు పిచ్చయ్య

సుబ్బారాయుడు అడ్డొచ్చి "సరే లేవయ్యా అవధాన్లూ! ఇంకెవర్నో చూసొచ్చి రామయ్య కూతుర్నంటావేంది. ఆ అమ్మాయి అట్లాంటిదిగాదని ఊళ్లో ఎవరికీ తెలీదూ?" అన్నాడు.

"నాకు ఆశ్చర్యంగానే వుంది. శాస్త్రోకూస్తో చదువుకున్న అమ్మాయి. తెలివైన పిల్ల. అలాంటి

పొరబాటు చెయ్యరులెండి, అవధాన్లూ. రామయ్య వంశంలోనే లేదా అలవాటు" అన్నాడు పిచ్చయ్య.

అవధాన్లు చుర్రుమన్నాడు: "అయితే నేచెప్పేది అబద్ధమా? ఈ రెండుకళ్లతో చూసినవాణ్ని - నేనూ! రామయ్య కూతుర్ని ఆమాత్రం గుర్తుపట్ట లేనటయ్యా? ఆపిల్ల కడవెత్తుకొని సుబ్బయ్యతో మాట్లాడుతూ నన్ను చూచి తప్పుకుపోయింది."

"నిజమే కావచ్చులెండి. పడుచుపిల్ల. రెండేళ్ల నుంచి ఇంట్లో ఉన్నపిల్ల ఆపని చేసేవుంటుంది లెండి" అని నాయుడు బలపరచడంతో అవధాన్లు మొహం తేటపడింది.

సుబ్బారాయుడు పాపం నమ్మలేకపోతున్నాడు. రామయ్య బీదవాడైనా బహుగౌరవ్యుడనే విషయం తెలుసు. భార్య చచ్చిపోయిన నాటినుంచీ కూతుర్ని ఎంతో ఆప్యాయంగా పెంచి చదువు చెప్పించాడు. లక్ష్మి — తను ఎరుగున్నవరకు బుద్ధిమంతురాలే — అయితే అవధాన్లు చూచానంటాడేమిటి? ఇదేదో సమస్యే అనుకున్నాడు సుబ్బారాయుడు.

మొదట్లో నమ్మలేకపోయినా రెండోసారి నమ్మకం కలిగిపోయింది. లక్ష్మి యౌవనంలో ఉండటంచేత, తన ఈడు కాకపోయినా ఏదో కాస్త అందంగా వుంటాడు గనుక ఒప్పుకొని వుండవచ్చునను కొన్నాడు.

నాయుడు ఇంతకుముందే రెండుమూడు కేసులు ఇలాంటివే విన్నాడు. అవధాన్లు నోటిమీదుగానే. రంగమ్మ - భోగయ్య విషయంలో తమజోక్యం కలిగించుకొని వాళ్ళని లేకలెయ్యడంకూడా జరిగింది. కాని, ఇది కొత్తవిషయం. గ్రామంలో యిలాంటివి జరగటానికి వీల్లేదు. అందులో తాను మునసబుగా వున్న గ్రామంలో, ఇల్లాంటి వెధవ్వేషాలు వేసే వాళ్లకు బుద్ధిచెప్పాలి అనుకున్నాడు.

రామయ్య కూతుర్నిగూర్చి అరగంటపైగా చర్చ జరిగింది. ఒకవిధంగా అవధాన్లు దాన్ని వొదిలేట్టు లేడు.

"ఇదిగో నాయుడూ! నువ్వోసారి ఆ రామయ్యను పిల్చి గట్టిగా కేకలెయ్యకపోతే మనపరువు దక్కదు. ఈవూరు సానివాడైపోకతప్పదు" అన్నాడు హెచ్చరికగా.

మునసబు "కాకపోతే యింకా ఈ వేషాలు సాగనిస్తానా. వాళ్లను ఈ వూళ్లోంచి వెళ్లగొట్టకుంటే మళ్లీ నేను నాయుణ్ణికాను" అన్నాడు.

అవధాన్లు జర్రుమని పొడుం పీల్చుకొని పొడుం కాయ బొడ్లోకి దోపిస్తూ "తథాస్తు" అన్నాడు.

మునసబుగారు పిలిచారనగానే రామయ్య ఎకాఎకీన పరుగెత్తుకొచ్చాడు. మునసబుగారితోబాటు అక్కడ అవధాన్లు హాజరై వుండటంచూసి ఏదో పెద్ద విశేషం అని గాబరాపడ్డాడు.

రామయ్యనుచూసి మునసబునాయుడు "ఇదిగో రామయ్యా! ఈ వూళ్లో నువ్వింతకాలం పెద్దమనిషిగా వుంటున్నావ్. కాని నీ కూతురు ధోరణిమాత్రం ఏమీ బాగులేదు" అన్నాడు.

రామయ్య తలమీద పిడుగు పడ్డట్టయింది. కానీ ఏమీ మాట్లాడలేకపోయాడు. అలాంటి ప్రశ్నను ఎదుర్కోవలసి వస్తుందని కలలోకూడా అనుకో లేదు.

రామయ్య తెప్పరిల్లి "మా లక్ష్మి సంగతేనాండీ?" అన్నాడు.

"అవునోయ్. నీ కూతురు ఒక్కర్తేగా నీకుండేదీ. ఆ పిల్లసంగతి ఏమీ బాగులేదు."

రామయ్య అభిమానం దెబ్బతిన్నది. హఠాత్తుగా తలక్రింద దించేశాడు. ఏం చెప్పాలో తోచటంలేదు. ఈ ధోరణిచూసి అవధాన్లేమిటీ - పిచ్చయ్యకూడా నిర్ఘాంతపోయాడు. దొరికాడు దొంగ. ఇంతకంటే నిదర్శనం ఏం కావాలి?

రామయ్య తలెత్తి "మా లక్ష్మి అట్లాంటి పిల్ల కాదండి..." ఏదో చెప్పబోయాడు.

"ఆమాట నువ్వంటే సరిపోతుందంటోయ్. లోకం వొప్పుకోవద్దూ. చూచినవాళ్లున్నారు-ఏమంటావు?"

"మా లక్ష్మి ఏమీ తెలియని బిడ్డ. దానిమీద అపనింద మోపకండి బాబు. పెద్దలు మీరు. అది పెళ్లి కావాల్సిన బిడ్డ" ప్రాధేయపూర్వకంగా అన్నాడు.

"ఏమీ తెలియనిబిడ్డలు - చూశావటయ్యా నాయుడూ. ఇలాంటి ఛాందసులుండబట్టే ఆ పిల్ల నాటకం ఆడుతుంది" అన్నాడు అవధాన్లు.

పిచ్చయ్య పొగాకు చుట్టుకుంటూ రామయ్యను సావధానంగా చూసి — "ఇదిగో చూడు రామయ్యా. ఏదో జరిగిపోయింది గాని - ఇవన్నీ అనుకొంటుంటే నలుగురూ వినడం — వింటే నగుబాట్లు. ఇంకైనా

ఆ పిల్లను నీ అదుపులో పెట్టుకో - అంతే ఎవరైనా చెప్పేది" అంటూ చెప్పదలుచుకున్న నాలుగుమాటలు అక్కడే వెళ్లగక్కేశాడు. చివర్న "ఆ కంసాలి సుబ్బయ్యను నీ యింటిఛాయలకు రాకుండా చూసుకో. అంతే" అని తేల్చి చెప్పేశాడు.

రామయ్య అవమానభారంతో కృంగిపోతూ తల వంచుకొని ఇంటిముఖం పట్టాడు. ఆ విషయమేమిటో తేల్చుకుందామని.

లక్ష్మి తనకు తెలీకుండా యింత ఘాతుకచర్యకు పూనుకుంటుందా? కన్నకూతురే తండ్రిని మోసం చేస్తే ఈ లోకంలో నమ్మదగిన వాళ్లెవరు? లక్ష్మి విషయం అలా అయివుండదు. వీళ్లు పొరపాటు పడి వుండవచ్చు. అయినా అవధాన్లు చూశానంటున్నాడే. ఎలా నమ్మకపోవటం? పెద్దమనుషులు అబద్ధాలాడతారా? ఇంటికి వస్తూపోతున్న సుబ్బయ్య చివరికి చేసేపని యిదా? లక్ష్మికి కట్నాలిచ్చి పెళ్లిచేసే దిక్కు లేకుండా, నానాతంటాలుపడి చివరికి రెండో పెళ్లివాడ్ని పట్టి, వాడికిచ్చి చెయ్యబోతుంటే - వొద్దనీ, తానెక్కడైనా సంబంధం తెస్తానని, నమ్మేటట్టు మాయమాటలు చెప్పి నాగొంతు కోసింది ఇందుకేనేమో సుబ్బయ్య - తనమేలు కోరినవాడిలాగ ఎంత నటించాడు... రామయ్యకు కోపం కట్టలు తెంచుకొని వచ్చింది.

బారెడుదూరంలో కంసాలి సుబ్బయ్య కన్పించాడు. గడ్డి మోపెత్తుకొని అటువేపు డొంకలోకి జారుకున్నాడు. దొంగకు అనుమానమేగా! ఎందుకలా చిత్తరచూపులు చూస్తాడు. నిలవేసి అడుగుదామనిపించింది... కాని ఏమని అడగాలి? ఛీ! అనిపించింది.

రామయ్య ఇల్లు చేరుకున్నాడు. లక్ష్మి యింట్లో లేదు. రామయ్య కోపం తారస్థాయి నందుకొన్నది. సుబ్బయ్య తప్పకుండా అక్కడికిచేరి వుంటాడు. వాళ్లిద్దరూ ఏవో గుసగుసలు... నవ్వులూ... అబ్బ... అతను భరించలేకపోయాడు. ఆ విషయం తల్చుకుంటే రక్తం వేడెక్కిపోతుంది. రామయ్య తల ఆలోచనల్తో బరువెక్కిపోయింది.

కొంతసేపటికి లక్ష్మి తిరిగివచ్చింది. నీళ్లకడవతో లోపలికి వస్తూ "ఎంత సేపయింది నాన్నా-వచ్చి?" అంటూ చిరునవ్వు నవ్వుతూ వచ్చింది.

మరెప్పుడైనా అయితే రామయ్యకు ఆనవ్వులో స్వర్గద్వారం కన్పించేది. కాని ఈనాడు ఆ హాసం భయంకరమైన రాక్షస వికటాట్టహాసంలా కనిపించింది రామయ్యకు. తనను వెక్కిరించినట్లనిపించింది.

"లక్ష్మీ! అని బిగ్గరగా అరిచాడు.

లక్ష్మి అదిరిపడ్డది. చేతిలో కడవ అలాగే జారిపోయింది. రామయ్య దగ్గరకొచ్చాడు. తన కళ్లలో నిప్పులు కక్కుతున్నాయి. అంతకోపం చూట్టం లక్ష్మికి అదే మొదటిసారి.

"ఎక్కడ్నుంచి రావడం? సిగ్గు లేదంటే ముండా. నన్ను నలుగుర్లో తలెత్తనీయవంటే" అని అరిచాడు.

"ఏమిటి నాన్నా..." లక్ష్మి వణికిపోతూంది.

"తెలీనట్టు నన్ను మోసపుచ్చుతావా... ఏమీ ఎరుగనట్టు వాడితో. చెప్పు నిజమేనా?" అని గర్జించాడు.

"ఏమిటి నాన్న అంటున్నావ్..."

"ఏమిటా..."

వొళ్లు తెలియనికోపం వచ్చింది. ఆ వేశంలో లక్ష్మి జుట్టు పట్టుకొని వంగదీసి నాలుగైదు గుద్దులు గుద్దినాడు రామయ్య. ఆ దెబ్బలకు ఓర్చుకోలేక లక్ష్మి స్పృహతప్పి పడిపోయింది. రామయ్య కోపంలో ఎక్కడికో వెళ్లిపోయాడు. ఊరంతా ఈ విషయం గుప్పుమంది. ఊళ్లో ఏమూల విన్నా సుబ్బయ్యగారి ఇతిహాసమే. లక్ష్మిమీద కూసింత సదభిప్రాయం వున్నవాళ్లుకూడా ఈ వదంతికి తలొగ్గిపోయి తమ అభిప్రాయం మార్చుకున్నారు.

మొత్తానికి సుబ్బయ్య జుత్తులో వెంట్రుకలేకుండా రాలిపోయ్యేట్టు విమర్శాపరంపర చెలరేగింది.

సుబ్బయ్య ఎక్కడికో పారిపొయ్యాడు. అపవాదు భరించలేక పారిపోయినట్టుంది... ఏం చేస్తాడు మరి?

సుబ్బయ్యను ఎలాగైన వూళ్లోనుంచి వెళ్లగొట్టెయ్యాలని సన్నాహాలు జరుగుతున్నాయి. ఏంచేస్తారు మరి గ్రామస్థులు మాత్రం? తరతరాలుగా పెద్దమనుష్యులకు పేరుపడ్డ ఆ గ్రామంలో అలాంటి దురంతం జరిగిందంటే - ఎంత అప్రతిష్ట. ఈ విషయంలో మునసబుగారికి మంచిపట్టుదలే కలిగింది.

(90వ - పేజీ చూడుడు)

# మద్రాసులో తెలుగు పిల్లలకు విద్య: కేసరిసంస్థ అమోఘకృషి

## వార్షికోత్సవంలో రాష్ట్ర రెవెన్యూమంత్రి ప్రశంస; విరాళాలిచ్చి తోడ్పడాలని కార్యదర్శి విజ్ఞప్తి



నగరంలోని తెలుగువారి పిల్లలకు విద్యాసౌకర్యాలు కల్పించి అమూల్యమైన సేవచేస్తున్నందుకు కేసరి విద్యాసంస్థను, ముఖ్యంగా శ్రీ. బి. వి. శ్రీహరిరావునాయుడు గారి సేవను మద్రాసు ప్రభుత్వ రెవిన్యూ మంత్రి ప్రశంసించారు.

ఈనెల 6వ తారీఖు సాయంత్రం మైలాపూర్ ఉన్నత పాఠశాల ఆవరణలో కేసరి విద్యాసంస్థల వార్షికోత్సవమునకు అధ్యక్షత వహిస్తూ మధ్యాహ్న భోజనముతో సహా ఆరవఫారమువరకు ఉచితవిద్యాప్రదాన పథకమును ప్రభుత్వంవారు త్వరలోనే అమలు జరుపగలరని శ్రీ నాయకర్ చెప్పారు.

కేసరి విద్యాసంస్థల అధ్యక్షుడు డా॥ నెదుంగాడి తరఫున శ్రీ శ్రీహరిరావు నాయుడు మంత్రికి, వారి భార్యకు స్వాగతము చెప్పారు.

'మా పాఠశాలలకు సంబంధించినంతవరకు గవర్నరునుండి విద్యాశాఖ ఉద్యోగుల వరకు సద్భావంతోనే వున్నారు. ఈ రాష్ట్రంలో తెలుగువారికి అల్పసంఖ్యాకులుగా వున్నట్లే అనిపించటంలేదు. ఇటీవల ప్రభుత్వము పాఠశాలలో అల్పసంఖ్యాకులకు ప్రస్తుతము వున్నసౌకర్యాలను అనుమతిలేకుండా రద్దుచేయకూడదని ఆదేశించి వున్నారు. ఆరవ ఫారమువరకు ఉచిత విద్యా పథకము అమలుజరిగితే తెలుగు వారి పిల్లలకుకూడా ఎంతో సహాయం కాగలదు. కనుక ఈ పథకమును వెంటనే అమలు జరుపగలరని ఆశిస్తున్నాను. నిరుడు వార్షికోత్సవములకు గవర్నరు, ఆ క్రితము సంవత్సరాల్లో ముఖ్యమంత్రి, విద్యామంత్రి అధ్యక్షత వహించి వున్నారు. మా ఆహ్వానం అంగీకరించి వార్షికోత్సవములకు అధ్యక్షత వహించినందులకు మీకు కృతజ్ఞతాపూర్వక వందనములు అర్పిస్తున్నాను' అని శ్రీ శ్రీహరిరావునాయుడు చెప్పారు.

ఆ తరువాత కేసరి విద్యాసంస్థల వార్షిక నివేదికను సమర్పిస్తూ శ్రీ శ్రీహరిరావునాయుడు ఈ సంవత్సరం రు. 22928 లు విరాళాలు వసూలైనవని అంజలీ పిక్చర్సు వారు రు. 4000, శ్రీ యార్లగడ్డ వెంకన్న చౌదరి రు. 3000, విజయవాడ నవయుగ ఫిలిమ్సువారు రు. 2000 ఇచ్చినట్లు తెలియజేశారు. ఇదిగాక ఏలూరులో కేసరి ఎడ్యూకేషన్ సొసైటీ కార్యదర్శి రు. 732 సేకరించారని, శ్రీ కృష్ణరాయబారం నాటక

ప్రదర్శనంద్వారా రు 13080 వసూలైందని చెప్పారు.

"శ్రీ బి. నాగిరెడ్డి విరాళంతో నిర్మించబడిన నాగిరెడ్డిహాల్ క్రిందటి సంవత్సరము V ఫారమును ప్రారంభించుటకు వసతి కల్పించింది. శ్రీ గోగినేని చినవెంకటేశ్వరరావునాయుడు, వారి అన్న శ్రీ॥ శే పెదవెంకటేశ్వరరావు స్మారకచిహ్నంగా నాగిరెడ్డి హాలువంటి కాంక్రీటు కప్పుగల ఒక హాలు నిర్మాణమును వాగ్దానము చేశారు. ఈ హాలు 1960 మే నెల లోపల నిర్మాణమయినచో 1960 జూన్‌నుండి VI ఫారమునకు వసతి ఏర్పడగలదు. అంజలీపిక్చర్స్ లిమిటెడ్ గత సంవత్సరము యిచ్చిన రు. 4000 లు గాక ఇంకొక రు. 2000 లు, శ్రీ రేలంగి వెంకట్రామయ్య రు. 4000 లు యీ సంవత్సరములో విరాళము లిచ్చునట్లు వాగ్దానము చేసియున్నారు.

ఈ సంఘ నిర్వహణక్రింద మూడు విద్యాలయముల అభివృద్ధి ఈ దిగువ వివరించబడియున్నది. ఇందులో ముఖ్య విషయాలు-1958 లో మూడు సంస్థలలోని విద్యార్థుల సంఖ్య 1228 కాగా 1959 లో 1273; అందులో బాలికలు 469. స్థలాభావంచే ప్రవేశమును మేము నిరాకరించకున్నట్లయితే త్యాగరాయ నగరులోని కేసరి ఎలిమెంటరీ స్కూలులో విద్యార్థుల సంఖ్య యింకా అధికమయి వుండెడిది. 1959 నుండి జీతములు వసూలులేని స్కూలుగా మార్చుటచే ప్రవేశమునకు యెక్కువమంది వచ్చిరి. విద్యాశాఖవారు మూడు సంస్థల నిర్వహణ మొత్తంమీద తృప్తికరంగా నున్నదని ప్రకటించారు.

ప్రస్తుత పరిస్థితులలో కీ॥ శే॥ డాక్టరు కేసరిగారొసగిన మూలధనంనుండి విరివిగా వినియోగించనిదే 2 హైస్కూళ్లు ఒక ఎలిమెంటరీ స్కూలు నిర్వహించుట సాధ్యమగుటలేదు. కాబట్టి పరిపాలకవర్గంవారు యీ సంస్థల నిర్వహణ సందర్భమున మద్రాసు నగరంలోని ఉదారులగు తెలుగువారికి విజ్ఞప్తిచేసేది యేమనగా యీ సంఘనిధిని బాగా పెంపుచేసి, ఏ ఒక్క సంస్థను మూయకుండా మూడు సంస్థలు విజయవంతంగా నిర్వహించబడటానికి తోడ్పడవలసినదని. ఈ మూడు విద్యాలయములు ఆయా ప్రాంతంలో తెలుగు బాలబాలికల విద్యావసరములను తీర్చుచున్నవను విషయము అందరికీ తెలిసినదే. ముఖ్యంగా గత సంవత్సరములలో వాగ్దానముచేసిన దాతలు ఆయా విరాళములిచ్చి విద్యాసంస్థల అభివృద్ధికి, నిర్వహణకు తోడ్పడవలసినదిగా శ్రీహరిరావునాయుడు విజ్ఞప్తి చేశారు."

శ్రీ మాణిక్యవేలు అధ్యక్షోపన్యాసంలో ఇంకా ఇలా చెప్పారు: "అన్ని దానములకంటె విద్యాదానము గొప్పది. కేసరి విద్యాసంస్థలు నగరంలో తెలుగువారి పిల్లలకు బాగా కృషి చేస్తున్నాయి. నాయుడుగారికి ఎంతమంది సంతానమో తెలియదు గాని ఈ రూపముగా వందలకొలది మనుమలు, మునిమనుమలు ఏర్పడ్డారు. ఈ సంస్థలే లేకుంటే నగరములోని తెలుగు వారికి విద్యాసౌకర్యాలు ఎక్కువగా వుండేవికావు. ఈ రోజుల్లో ఆడ, మగపిల్లలందరికీ చదువు అవసరము. ప్రజాస్వామ్యంలో చదువు లేకపోతే ప్రపంచ

నడక తెలియదు. అందువలన విద్యాసౌకర్యాలు కల్పించవలసిన బాధ్యత ప్రభుత్వము, ప్రజలపైన వుంది. ముఖ్యమంత్రి ప్రకటించిన ఉచిత విద్యాపథకము త్వరలోనే అమలు జరుగుతుంది.

ఈ విద్యాసంస్థలద్వారా నగరంలో విద్యాసౌకర్యాలు ఎక్కువ చేస్తున్నందుకు చాలా సంతోషముగావుంది. ఈ సంస్థ ఏర్పడుటకు మూలపురుషులైన శ్రీ॥ శ్రీ॥ కేసరిగారికి, చందాలు ఇచ్చి సంస్థలను ఆదుకుంటున్న దాతలకు నా కృతజ్ఞత తెలుపుతున్నాను'' అన్నారు.

ఆ తరువాత శ్రీమతి మాణిక్యవేలు నాయకరు కేసరి విద్యాసంస్థలలో చదువులలోను, క్రీడలలోను ప్రతిభావంతులైన విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టారు.

కార్యక్రమము పాఠశాల విద్యార్థినుల ప్రార్థనతో ప్రారంభమై వైజ్ఞానిక, వినోద కార్యక్రమంతో ముగిసింది.

కేసరి ఉన్నత పాఠశాల (మైలాపూర్) ప్రధానోపాధ్యాయులు శ్రీ కె. వెంకట్రాజు వందన సమర్పణ చేశారు.

---

# సదాచార సూత్రములు

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

(డిశంబరు సంచిక తరువాయి)

57. సదా దుర్మార్గులకు దూరంగా ఉండాలి.
58. శాస్త్రోపదేశాలను అంగీకరించనట్టి మానవుడు జీవితాంతం విచారిస్తూంటాడు.
59. తల్లిదండ్రులను, గురువునూ, తనకు హితంకలిగించే విషయాలను అడగాలి.
60. భవిష్యత్తును ఆలోచించి వర్తమానకార్యాన్ని కొనసాగించే పురుషుడు సద్గతిని పొందుతాడు.
61. పురుషుడు ఏకపత్నీవ్రతుడు కావడమూ స్త్రీ పతివ్రత కావడమూ సనాతనధర్మము.
62. సత్కార్యాచరణకు ఎన్నడూ వెనుదీయరాదు. సమయగతి ఎన్నడూ అనుకూలించదు.
63. పరమార్థమందు మనస్సును సంలగ్నం చేయువాడు స్వార్థాన్నికూడా సిద్ధింపచేసుకుంటాడు. పర పరమార్థం స్వార్థంకన్న మహత్తరమైంది.
64. మీ చేతుల్లో అధికారముంటే దాన్ని సద్వినియోగం చెయ్యండి.
65. సుగమంగా చేయగల పనులనుగూర్చియే ముఖతః ప్రస్తావించాలి.
66. మానవుడు తన దుర్గుణాలపై ధ్యానంకలిగి ఉండాలి.

# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-

అనువాదము: Dr. W. రాధాకృష్ణయ్య



### అవతారిక

దూరదర్శిని (Telescope) యను దుర్భిణికి రెండు వైపుల భూతద్దపు బిళ్ల లమరియుండును. దృక్‌బిళ్ల యొకటి, దృశ్యబిళ్ల యొకటి. ఈ రెంటి అమరిక సక్రమముగ కుదిరినపుడు దూరవస్తువులు స్పష్టముగ కనబడును. వాటి అమరికయందు వ్యత్యాసముండినచో, దృశ్యము స్పష్టముగ కనబడదు. అదేవిధముగ ప్రపంచమును దర్శించుటకు, మనసు, బుద్ధి యను రెండు కొరముట్లు మనకు కలవు. ఇందు బుద్ధి దృక్‌బిళ్ల, మనసు దృశ్యబిళ్ల వంటివి. వీటి అమరిక సక్రమముగ నుండక పోయినచో, విషయముల నిజరూపము కనబడదు. దృశ్యప్రపంచ మస్పష్టముగ, విపరీతముగ కనబడును. వీటి అమరిక పరిపక్వముగు కొలది, వాటిద్వారా చూడబడు దృశ్యములు స్పష్టముగ కనబడగలవు

భక్తి, కర్మ, జ్ఞాన, యోగములనబడు చతుర్విధ పారమార్థిక సాధనలందు, ఏదోయొక దానితో, లేక వాటికలియికవలననో, జీవితమును పవిత్రము చేసికొనగలిగినవ్యక్తి, తన జీవితముయొక్క సంపూర్ణతను, స్పష్టముగను, సూక్ష్మముగను దర్శించగలుగుచున్నాడు. అట్టివాడు తన కాలమున కలుగుచుండు విపరీతములకు, అవినీతులకు లొంబడడు. అతడా జీవితమును స్వయముగ విమర్శించును. ప్రపంచవిషయము లెల్ల విషయములని తెలిసికొనుచున్నాడు. "అనిత్యము" అను చీకటి ప్రపంచమును నలువైపుల కప్పుకొని, విషయగాములకు వికారములు కల్పించి, అసహ్యపరచుచుండుట అతడు గమనించును.

అనగా, అతడు నాస్తికుడగుచున్నాడని కాదు. విసుగువలన నిరాశ పొందగలడని కాదు. జీవితమును నిష్పక్షముగ విమర్శించి, బాహ్యాభ్యంతర విషయానుభవములను గుర్తించి, మానవుల బహిరంగ, అంతరంగ వ్యవహారములను తిలకించి, రాగద్వేషములు లేక పరిశీలించి, నిజతత్త్వమును కనుగొనుచున్నాడు, ఒక శాస్త్రపరిశోధకుడు దుర్భిణి సహాయముతో సూర్యోదయమును స్పష్టముగ గమనించునట్లు గమనించుచున్నాడు.

ఒక కవియొక్క బుద్ధి, అతని భావావేశములచే నొకప్పుడు మరిగిపోగలదు. కాని, యొకశాస్త్రజ్ఞుని బుద్ధి అతని విచారసమయమున మరగిపోవుటలేదు. శాస్త్రపరిశోధకుడు, ప్రకృతియందు తాను కనుగొను విషయాంశములను, వరుసక్రమముగ లిఖించుకొనుచుండును. అదేవిధముగ, అంతరంగ సుగుణసంపూర్ణుడగు సాధకుడు, అనురాగములు లేక, పూర్వాభిప్రాయముల మైల సోకనీయక, నిష్పక్షముగ, విషయరాసుల విమర్శించి, వాటియొక్క సమ్యక్‌జ్ఞానమును సమకూర్చుకొనుచుండును.

అట్టి పూర్ణదశ పొందినవ్యక్తి, మానవ మానవుడగుచున్నాడు. అతడు జ్ఞానమార్గము నవలంభించి, వేదాంతము తెలుపు సత్యము నన్వేషించుటకు యోగ్యుడగుచున్నాడు. అతనికి, ఈ ప్రపంచజీవితము కేవల నిష్ప్రయోజకమనియు, బూటకమనియు తోచగలదు. "ఇట్టి స్వప్నతుల్య జీవితమేల కలిగె" నని అతడాశ్చర్యపడును. ప్రపంచమున కారణములేని కార్యమొకటికూడ జరుగజాలదని అతని సూక్ష్మబుద్ధి పలుకుచున్నది. తనకు గ్రాహ్యము కాకపోయినను, నిజముగ ఇందొక గొప్పయుద్దేశము దాగియున్నదని అతడు విచారించును.

ఇట్టి అశాంతి, అతనికి తొలుత యొక విచార జ్వాలవలె యేర్పడినను, త్వరలో అదియొక గొప్ప దావాగ్నివలె, అంతరంగమున ప్రజ్వలించి అనేక సంశయముల చెలరేగించును. జీవిత సమస్యయొక్క సమాధానమున కతడు తీవ్రపరిశోధన మొదలిడును.

తన యశాంతి ఉపశమించుటకు సాధకుడొక సద్గురువు నన్వేషించును. అతనియొద్ద తన హృదయమున గల సంశయముల నెల్ల గ్రక్కివేయును. హృదయశాంతి కోరును. ప్రపంచ వ్యవహారములకెల్ల తర్కసమన్వయ సమాధాన మాశించును. గురువు అతనియందు కనికరము చూపును. శాంతముతో ఆలకించును. ప్రియవాక్యములు పలికి ఓదార్చును. సత్యస్వరూప ముపదేశించును. ఆవిధమున, మహాఋషులు తమ ఆశ్రమపంచలందు తమ శిష్యులకు బోధించు

చుండిరి. వేదకాలమునుండి అట్టి ఉపదేశములు గురువు శిష్యపరంపర. తరతరములవారికి అందు చుండెను. ఆ యుపదేశములెల్ల కూడి, హిందూమత సిద్ధాంతములై యున్నవి. వాటిని శ్రుతులు లేక వేదములు అనబడును.

శ్రుతి వాక్యముల కనుగుణముగ జీవితము లమరి యుండవలెను. శ్రుతివాక్యములకును, జీవిత నడవడుల నాదేశించు ధర్మశాస్త్రములకును ఎడబాటు కలిగినచో, అట్టి శాస్త్రములు నిర్జీవములగుచున్నవి. వాటి నుండి ఎట్టి సిద్ధాంతములు వెలువడజాలవు. అవి మానవుని దుఃఖముల తొలగించజాలవు. ఓదార్చజాలవు. శ్రద్ధావంతులగు మత అనుయాయులకు మార్గము చూపజాలవు. జీవితనడవడికలకును, పరిపూర్ణ మత సిద్ధాంతములకును సన్నిహిత అన్యోన్యభావము లుండవలెను. ఒక సంగీత శిఖామణికి, అతని ప్రక్క వాయిద్యములకును గల అన్యోన్యతవలె యుండవలెను. ఒక పక్వఫలము కలుగుటకు, చెట్టునకును ఆ చెట్టున గల పూగుత్తికిని గల అన్యోన్యత అమరవలెను. ఒక మతమునందలి సూత్రములలో, నియమములలో విప్లవము కలిగినచో, ఆ కాలపు జనసమాజమునకెల్ల జీవిత విధానమున వ్యత్యాసము ఏర్పడుచున్నవి.

సమాజమున నీతినియమములు విపరీతమయినచో, అట్టి విపరీతములనుకూడ తన యొడియందొక ప్రక్కన చేర్చుకొని, మరియొక ప్రక్కన, సమాజమున కాస్పద మిచ్చుటకు సళ్లుబారి, విశాలమై, పరివర్తనముపొంది, ఆశ్రయమిచ్చుటకు, కౌగిట చేర్చి, ఆలింగనము చేసుకొనుటకు తగుచాతుర్యము, మతమునకు సమకూడి యుండవలెను. అట్టి సమయోచిత ఉదుకుడుకులకు, అవకాశమీయజాలని మతము, సంఘముయొక్క ఉద్రేకములను అనుసరించజాలక కృంగిపోవును.

అట్లు మట్టిగలసిన మతముల గోరీలపై గల స్మారకపతకములు, ఏకరీతిగ, వాటి దుఃఖములను ప్రకటించుచున్నవి. నవయుగమున, ప్రబలియుండు "ప్రాపంచక సర్వజన సమానత్వ" మను సూత్రమున ప్రస్తుత మతములనెల్ల తులతూచినచో, ఈ మతము లన్నియు, పూర్ణాయువు పొందినవనియు, త్వరలో రూపులేక పోగలవనియు, నిర్ణయించవచ్చును. మత చరిత్రల పరిశోధనల వలన, జీవిత ధర్మములకును, మతమునకును, పతిసతుల దాంపత్యమువలె, అన్యోన్యత చేకూరవలెనని తెలియుచున్నది. కాని, మన తొందరపాటులలో ఆతురతతో, మన అజ్ఞానము వలన, తాలిమిలేక, ఏదోయొక కారణమువలన, జీవితమునకు, మతమునకు సంబంధమేమున్నదని సందేహించుచున్నాము.

ఇతర పాశ్చాత్య మతములవలె, హిందూ మతము, కేవలసూత్రములు, నియమములు, ప్రబోధలతో నిండిన బిరుసుగ్రంథమువంటిది కాదు. మన పవిత్ర మతగ్రంథములందు, శాస్త్రసమ్మత జీవితవిధానములు తెలుపబడియున్నవి. అభివృద్ధి పొందగల అవకాశములందు కూడియున్నవి. ఒక చెట్టును రక్షించవెంచి, దాని బోదెచుట్టు సిమెంటుతో గోడ కట్టినచో అది అభివృద్ధిపొందజాలదు. ఒక చెట్టుకు ఘనీభవించిన బెరడుండుట సహజము. కాని, ఆ బెరడు సజీవముగ నుండవలెను. లోనుండు బోదె పెరుగుట కవకాశమిచ్చి, వ్యాపించగల శక్తి కూడి యుండవలెను. జీవితశాస్త్రముగు హిందూమతమున ఈ పవిత్రసూత్రము అనుస్యూతమై యున్నది. హిందూ మతము నొక గ్రంథముగ నెంచినచో, అదొక తాళపత్ర గ్రంథముగ నున్నది. దాని యిరుప్రక్కల దళసరపు అట్టలు దానిని బంధించుటలేదు. పత్రములు విడి విడిగ నున్నవి. నూతనపత్రములు చేర్చుటకు నిరుపయోగోపదేశములు గల పత్రములను తొలగించుటకు, అవకాశమున్నది. ఇట్లు, చక్కని రూపసౌందర్యములు లేకున్నను, ఆ హిందూమతమునబడు గ్రంథమున, ప్రకటించబడు సత్యవచనములకట్టి పరివర్తనములు కలుగుటలేదు.

ఇట్టి ఆరోగ్యకర సూత్రములు, సుగుణసంపత్తి, సవరణల కవకాశములు హిందూమతమునందు అనాది నుండి అవిచ్ఛన్నముగ కూడియున్నది. ఇందలి కళానైపుణ్యములు చరిత్రాంశములుగ కీర్తినొసగుచున్నవి. హిందువుల పారమార్థిక దృష్టి విశాలమును కొనియాడుచున్నది. ఇతర మతములందులేని విశిష్టతను ప్రకాశించుచున్నది.

◆ ◆ ◆

వేదకాలమునందార్యులు తమ పరిసరములందను భవించగల భోగసమృద్ధివలన, చింతారహిత జీవితము వలన, ఆనందభరితులై యుండిరి. ప్రపంచమున ప్రకృతికేంద్ర మనగల గంగాతీరమున, వారు జీవితానంద పరవశులగుచుండిరి. జీవితము కడుసుఖతరముగ వారి కనుకూలించెను. ప్రకృతినుండి వారు పొందగల సుఖము, పవిత్ర ప్రేమవలన, వారి జీవితమానంద

పారసంగీతముగ తేలిపోవుచుండెను. వారు భగవంతుని బిడ్డలు. గంగామాత వారి తల్లి. ఆమె యొడిలో నిద్రపోవు బిడ్డలకు చింతలెక్కడివి. దుఃఖమెక్కడిది. వారికి అంతర కోలాహలములు తెలియవు. బాహ్యమున వారికెట్టి అనానుకూలములు కనబడుటలేదు. ఎట్టి కష్టపరిశ్రమ లేనిదే, ఆ సారవంతముగు భూమి, పంట, రెండుపంటల రెట్లు ఫలితము లొసగుచుండెను.

ఆరోగ్యవంతమగు వాతావరణము, దట్టమైన అడవులు, పవిత్రమైన నదులు, ఉన్నత పర్వతములు, నీలవర్ణపు ఆకాశశిబిరము, ఉరువడిగల ప్రవాహములు, ప్రశాంతరాత్రులొసగు ఆనందము, విషయవాంఛ లెరుగని సాంఘికజీవనము, ఇట్టి విచిత్ర ప్రపంచావరణమున, నివసించగలిగిన, హిందువుల అదిపురుషులు, జీవిత పరిపూర్ణులై, సుభిక్షమున, కవిత్వము చేయ పురికొల్పబడుచుండిరి. వారికి కలిగిన విరామకాలమందు, వారు బుసగొట్టు పాముల వెంబడి పరుగిడుచుండలేదు. అంటగాని ఫలము నపేక్షించలేదు. వృక్షఛాయలందు, మితోష్ణమనుభవించుచు, విరామము కలిగినప్పుడెల్ల, వినోదకరకవిత్వము, ఉల్లాసకరగానముల పాడుచుండిరి. ప్రకృతియందు కనబడు శృంగారమున కనుగుణముగ, వారి భావావేశము లుప్పొంగుచుండును. నలుదిక్కుల యథేచ్ఛముగ దొరకు, ఫలభరిత ప్రకృతిసంపదయందు తులతూగుచుండిరి. ఉన్నతవృక్షముల ఛాయయందు, నదీతీరమునందు, మృదువగు శీతల పచ్చికభూములపై, విశేష తివాసీల పేక్షించక, మందోష్ణతయందు, చలికాచ్చుకొనుచు, అప్రయత్నముగ, భావకవిత్వముల వెదజల్లుచుండిరి. ప్రకృతిని వర్ణించుచుండిరి. ప్రకృతియొక్క విచిత్రప్రవర్తనల కీర్తించుటతో కాలము గడుపుచుండిరి. ఆర్యమహాశయులు, నదులను, వృక్షములను, పర్వతములను, మేఘములను, సూర్యచంద్రులను, వర్షమును, వాయువును, పైరుపంటలను, మానవులను, మృగములను అన్నిటిని వర్ణించిరి. అవియెల్ల ఆనాటి మతవిషయములుగ ఏర్పడెను. అవియే వేదములందు ప్రథమమునగల మంత్రభాగములుగ నేడు అమరియున్నవి.

(సశేషము)




గృహలక్ష్మి

చందా వివరములు

సంవత్సరచందా - రు. 4-50

6 మాసములచందా - రు. 2-25

విడిప్రతిక 40 నయాపైసాలు

ఏజంట్లుకు 100కి రు 20 లు కమీషను ఒక ఫ్రీ కాపీ యివ్వబడును. చందాలు సేకరించి మాకు పంపువారికి రు. 100 కి 20 లు కమీషను యివ్వబడును.

మేనేజరు, గృహలక్ష్మి,

మదరాసు - 14.

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

చతుర్థాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గతసంచిక తరువాయి)

౧

బ్రహ్మాండ భాండముల్ పాలించు దక్షుండ
వంబుధి గర్వాపహారి వీవు!
ఆశ్రితమునుల, ప్రత్యక్షకల్పక మీవు
బ్రహ్మయు, శివుడు, దేవతలు, నిన్ను
స్తుతియింప, శ్రీరామ! సుందరాకారుఁడై
పుట్టువులేనట్టి జెట్టివీవు!
శ్రీ కుచకుంభ చ్చురిత-చందనాలంకృ
తంబగు, వక్షస్థలంబుఁ గల్గి
ముద్దుమోహాన మూర్తివై మురిసెదీవు!
దాతవీవు! కౌసల్యానందనుడ వీవు!
రామ! సుగుణాభిరామ! సీతామనోహ
రా! అభయమిచ్చి రక్షింపు; రామచంద్ర!

౨

సాకేతపుర, మహాసౌధంబు లెల్లెడ
మణి నిర్మితంబౌచు- మందిరాంత
రంబు. పతాకోజ్జ్వలంబందు, సూర్యకాం
తి, చొఁఅదు; ఘణఘణ నిస్వనముల|
బంగారు గంట.. రంగారు; డోలికా
శయ్యపై, శ్రీరామచంద్ర! నీవు
సీతాసమేతుఁడై - జెం వొందుచున్నావు
ముద్దులఁగూర్చెడి మోహనాంగ!
రఘుపతీ! నిన్ను భజియింతు-నఘముబాపి
పుణ్యకార్యంబు లొనగూర్చు బుద్ధినిచ్చి
కుమతుల, నెదుర్కొ నియెడు, ధైర్యము,
నొసంగి
కాపుమా! రామచంద్ర! విఖ్యాత పురుష

౩

సాకేతపుర. మహాసౌధాంతరంబుల
రాజమార్గంబుల, రమ్యముగను
ధ్వజ తోరణములు సంబరముగా వర్ధిల్లె
ఘంటల ధ్వనులు, బ్రకాశపఱుప
మందయానంబున, మదపుటేనుగు వచ్చె
దానిపై. కనక కుంభంబునందు
వస్త్రభూషణ, విభవంబుల, శృంగార
దేహుఁడై, శ్రీరామ! దివ్యముగను
అధివసించితివి, శ్వేతాత పత్రముక్రింద
రథ గజ తురగ సంరంభ మతుల
కీర్తితో, జయజయరావముల్ సేయుచు
వెనువెంట వేంచేయ, విభవగరిమ
వెలయ, నూరేగుచున్నావు విమలచరిత!
రమ్యగుణసాంద్ర! రఘువీర! రామచంద్ర!
అంతరంగంబునందు నిరజింతసేతు
నింపుగా, మమ్ము సతము రక్షింపుమయ్య!

౪

బంగారు స్తంభముల్ - రంగారు సౌధంబు
తారాపథంబును దాకుచుండు
దివ్యాంబరములచే - నవ్యంబుగాగ, న
లంకృతమై, ప్రభలం వెలార్చు;
బహురత్నములచేత భాసిల్లి, సౌందర్య
నిధియయి, పైడివన్నియలఁ గూర్చు
చిత్రవిచిత్ర, పవిత్ర గృహంబందు
సీతాసమేతుఁడై, జిలుపుగాగ

రఘుపతీ! నవ్వుముఖముతో-రమ్యముగను
వెలయుచున్నా వయోధ్యలో వేదవేద్య!
నిన్ను భజియింతు సతతంబు నీరజాక్ష!
నన్ను రక్షింపుమయ్యా! సంపన్న చరిత!

౫

శ్రీయయోధ్యపుర, మాశ్రితుల కల్ప
కము; శృంగారంబు; మణి బహిర్ద్వారయుతము
తోరణాంచితము వీథులు; ప్రాంగణములెల్ల
రమ్యంబులందు, శ్రీరామ! నీవు
భరతాది సహచర వరులతో మెలఁగుచు
రత్నపు బంతుల రమ్యముగను
క్రీడలాడుచు, నున్నవాఁడవు; స్త్రీలకు
నేత్రోత్సవముల, పున్నెము లొసంగి
డెందమానందమున నింపి సుందరాంగ!
చిందుద్రొక్కుచున్నావు; ముకుంద! వరద!
మా మనములందుఁ గుందుల మాన్ప
వయ్య!
చిరతరానంద! గోవింద! శ్రీరమేశ!

౬

వైదూర్య మణుల ప్రభాభాసమానమై
దేవేంద్ర నీలకాంతిని, వహించు
రత్నగృహంబొందు రంజిల్లు, సాకేత
పురమందు; మందార భూజములు, వి
శేషంబు, మాణిక్య సింహాసనం బాగృ
హంబున శోభిల్లు హరువుతోడ
మదనమోహనులైన-మన్మథసుందరుల్
కుశలవుల్ శ్రీరామ కుతుకమలర
నీదు చరణసేవ, సాదరంబునఁ జేయు
చున్నవారు సతము సన్నుతాంగ!
రఘుపతీ! ముకుంద! రాఘవా! భజియింతు
అభయమిచ్చి కావుమయ్యా వరద!

౭

కౌసల్యమాత, శ్రీ కస్తూరిబొట్టు నీ
ఫాల భాగమునందు లీలను నిడెఁ
బున్నమచంద్రుని బోలు ముద్దుమొగంబు
గల్గిన శ్రీరామ! కనకరత్న
హారముల్ నీవు శృంగారంబుగా, ధరి
యించినాడవు; హరీ! ఇనకులేశ!
సీతాసమేతుఁడై - చెలఁగుచున్నావు; కౌ
సల్యా వరకుమార! సాధుశీల!
నిన్నుఁ బొగడుటకును నేనెంతవాడను?
పొగడికలకు నుబ్బిపోవు నీవు!
భక్తికలుగుచోట, ప్రాపు నీవై యుండు
రక్ష సలుపుమయ్యా - రామచంద్ర!

౮

ఫుల్లపద్మంబులఁ బొలుపారుచుండును
నిర్మల జలముల నెగడుచుండు
గంగోదకంబులఁ గమనీయమై యుండు
'సరయువు' నది, దాని దరమె పొగడ
దేవతాస్త్రీలెల్ల దివ్యంబుగా స్నాన
మాచరించెదరు, నాయంబువులను
ఆనీట జలకంబు లాడుచున్నావు; శ్రీ
రామ! సీతనుగూడి ప్రేమతోడ
దేవవనితలెల్ల - దివ్యంబుగాఁ గాంచు
చున్నవారు మిమ్ము - సన్నుతాంగ!
రామ! భక్తవరద! రామామనోహర!
అభయమిచ్చి కావుమయ్యా - వేగ.

(సశేషము)

# అన్యమతముల ప్రభావము

బ్రహ్మశ్రీ గుమ్మడిదల వెంకటసుబ్బారావు

ఈ శీర్షిక క్రింద క్రిందటి వ్యాసములో "వేద వాఙ్మయములోని స్త్రీల" విషయమై కొంతవరకు ప్రస్తావించితిని. ఈ వ్యాసములో మన నారీలోకముపై అన్యమతముల ప్రభావము గూర్చి పరిశీలించుట యావసరము. ఏలయన, ఒక కృష్ణానదియొక్క తుది స్వరూపము అద్దాని యనుబంధములగు తుంగభద్ర, భీమాది ఉపనదుల జలముల స్వభావ స్వరూపములపై కొంతవరకు యెట్లు ఆధారపడి యుండునో, అట్లనే నేటి భారత నారీలోకము వేలాది సంవత్సరములుగ యిచ్చట వెలసిన సహజ వైదిక సంప్రదాయములపైననే గాక, కొన్ని శతాబ్దములుగ యీ మహా ప్రవాహమున కనుబంధముగ నిచ్చట ప్రవహించిన అన్యమతములు, సంప్రదాయముల ప్రభావమును గూడ కొంతవరకు తనలో నిముడ్చుకొని యున్నది. కొన్ని సందర్భములందీ అన్యమతములు యితర వ్యవస్థలలో వలె మన నారీలోకమునందును కొన్ని వికృత రూపములను, విపరీత పరిస్థితులను సమకూర్చి, అట్టి "విజాతీయ" పద్ధతులను మనలో నింకను జీర్ణించుకొనుటయో, లేక కొంతవరకు నిరాకరించుటయో, జరుగవలసిన ఆవశ్యకతయు అగుపడుచున్నది.

కాని యీ "అన్య" శబ్దమునకు ప్రప్రథమముననే వ్యాఖ్యాన మవసరము.

భారత దేశమందు గతానుగతికముగ, సనాతనముగ, "శ్రుతిప్రమాణమ్"—అనగా వేదమే ప్రమాణమను సూత్రము సర్వేసర్వత్ర ఆదరణీయముగ బరిగణింపబడుచు వచ్చినది. శ్రుతులనుబట్టి స్మృతులు—తదనుబంధములుగ పురాణేతిహాసములు—ఇది మన ప్రమాణపరంపర. ఇందు వేదమే మూలమని యెల్లరు నంగీకరించుచున్నారు. కాలానుగుణ్యముగ స్మృతులు మారవచ్చును—పద్దెనిమిది పురాణములు యిరవైనాలుగు కావచ్చును—ఇతిహాసముల సంఖ్యయు పెరుగవచ్చును. కాని వీటన్నిటిలో పరమ ప్రమాణాధికారమొక్క వేదమునకే యొసంగబడినది. శ్రుతి స్మృతులలో యెచ్చటైనను వైరుధ్యభావ మేర్పడినచో వేదశాసనమే నెగ్గవలెను. కావున ఇచ్చట వేదమే "బ్రహ్మము"గ యెన్నుచున్నారు. ఏతద్భిన్నము లన్నియు "అన్యములే."

ఈ దృష్ట్యా, ప్రకృతమున నిచ్చట ఆచరణలోనున్న జైన, బౌద్ధ, పారశీక, క్రైస్తవ, ముసల్మాన, శిఖు సంప్రదాయములనన్నిటిని కొంతవరకు "అన్యములు"గనే మనము పరిగణించుట యవసరము. వీనిలో జైన, పారశీక, శిఖు మతస్థులు బహు అల్పసంఖ్యాకులగుటచే మన నారీలోకముపై అవి విశేషమార్పులను తెచ్చినవని చెప్పజాలము.

ఇక యితరమతములలో బౌద్ధము భారత నారీలోకములో చాల మార్పులను దెచ్చినదని మనము తేలికగా గుర్తింపగలము. ఆనాటికి ఆచరణలోనున్న వైదిక సంఘమందు అనగా భారతీయ సంఘములో-ధర్మరూపేణ స్త్రీ బహు నీరస స్థితికివచ్చియుండెనని మనము క్రిందటి వ్యాసమందు జెప్పితిమి. అప్పటికప్పుడే శూద్రునితోపాటు స్త్రీకిన్నిదాదాపు వేదాధికారమును కర్మాధికారమును తొలగిపోయెను. పురుషునికి వినా, యామెకు యెట్టి వ్యక్తిత్వమును లేదు. యజ్ఞాధికారము లేదు. వేదశాస్త్ర పఠనమునందును యామెకు విధి నిషేధము నేర్పడినట్లగుపడును. సన్యాసమున కామెకు సావకాశము లేకుండెను. ఇట్టి పరిస్థితిలో యామె సంఘములో ధర్మసీరనురాలగుటయు యామెలో చాలవరకు నిస్పృహ, నిరాశ, యుద్భవించుటయు, సహజము. ఈ పరిస్థితి నెదుర్కొనుటలో బౌద్ధమతము మన నారీలోకములో నొక విప్లవయుగమునే సాధించెననుట నిస్సంశయము.

ఉదాహరణ: బౌద్ధులు పురుషులతోబాటు స్త్రీలకును తమ "సంఘము"లో అగ్రస్థానమును సన్యాసాధికారమును ఒసంగిరి. ఈ రెండు సంస్కరణలతో యిచ్చటి స్త్రీ పురుష సంబంధములలో నొక మహావిప్లవ మేర్పడెను. స్త్రీలలో నొక నూతనోత్తేజము, మతేచ్ఛ, వైజ్ఞానిక తృష్ణ, కళాపిపాస, వైరాగ్య జీవనమును అబ్బినవి. నిజముగ యిచ్చట ఆనాటికాలములో బౌద్ధమతమంత హెచ్చుగ విజృంభించు

టకు స్త్రీ శూద్రాదులకీ సంఘమందు లభించిన గౌరవావకాశములే ముఖ్యకారణమని తోచును. అంతకు ముందు అణిగిపోయిన మన నారీలోకమును ఒక్కసారిగా పైకి ఉబికి, వికాసము జెందుటకీ బౌద్ధ సంస్కారమే ముఖ్యకారణము.

కాని యీ సంస్కారమునకు కొన్ని యడ్డంకులు, అందుకొన్ని లోపములును లేకపోలేదు. ఛాందసమైన సనాతన సంప్రదాయము యొక్క అడ్డంకి యెప్పుడును ఉన్నదే. దీనికి తోడు స్త్రీలలో వైరాగ్యము ముదిరిన కొలదియు సంసార చక్రము కొంతవరకు కుంటుబడుటయు, సంఘములో నచ్చటచ్చట అవినీతి పెరుగుటయు యిందలి సహజపరిణామములు. పైపెచ్చు వీరు బౌద్ధ సన్యాసులతోపాటు సన్యాసినులకును కల్పించిన "ముండనవ్రతములు" భారత నారీమణులలో విధవలగువారిలో పెక్కురను "రాండ్ హెడ్స్"గ జేసి వైచినవి. ఈ వికృతరూపమును కొంతవరకు సడలించుటకు పరాశరస్మృతియు, బ్రాహ్మ సామాజికమును యిచ్చట ప్రయత్నించవలసివచ్చెను.

బుద్ధుడు మొట్టమొదట యీ స్త్రీలకు తన సంఘములో స్థానమిచ్చుటకు చాలసందేహించెననితోచును. చాల కాలము నిరాకరించెనట. తుదకు తన పెంపుడు తల్లి గౌతమియే సంఘమందు ప్రవేశము గోరినప్పుడాతని శిష్యుడు ఆనందుని బలవంతముపై, యీమెకు కొంతవరకు అవకాశము నొసంగి, "నా సంఘ మొకవెయ్యేండ్లుండు ననుకొంటిని. కాని యిప్పుడు దీనికి అర్ధాయుష్యైపోయిన"దని వగచెనట. ఆ విషయమెట్లున్నను బౌద్ధవిహారములలో చాల చోట్ల వెలసిన అవినీతియే కొంతవరకు యీ దేశమందు బౌద్ధమంతరించుటకు ముఖ్యకారణమని చరిత్ర చెప్పుచున్నది.

భారత సంఘములో యీ నారీవిప్లవము నెదుర్కొనుటకు యిచ్చటి సనాతన వాదులెట్టి ప్రక్రియలకు గడంగిరో మన మీ సందర్భములోనే తెలుసుకొనవలసియున్నది.

బౌద్ధమతమునందలి యీ నారీవిప్లవము, యితర సంస్కారములకు ప్రత్యామ్నాయ యిచ్చట సనాతన వర్గము ప్రయోగించిన నూతన ప్రక్రియ "పూజావిధానము." అనగా నిగమముగనైన వేదముల స్థానే "ఆగమముల" నేర్పరచి, అశేషమగు తంత్రశాస్త్రముల నల్లి, అన్నిచోట్లను దేవాలయములను స్థాపించి, ముఖ్యముగ శక్త్యుపాసనను వృద్ధిపరచుటయే యిందలి కీలకము. దీనిని బట్టి ఆయారీతులంతకు పూర్వపు వైదిక సంఘములో లేవనికాదు_కాని వీటికి బౌద్ధానంతర సంఘమందు ప్రత్యేక విశిష్ఠతయు, బహుళవ్యాప్తియు లభించినవి. ఈ పూజావిధానములో విశ్వవ్యాప్తమగు శివశక్తులలో శివునకు కొంతవరకు అప్రాధాన్యత యిచ్చుటయు, శక్తియే ప్రధాన పాత్ర బడయుటయూ, తటస్థించెను. ఈ రెండు తత్వములలో ప్రప్రథమమున స్త్రీ నామమే యుచ్ఛరించవలెననియు, అటుల గానిచో కుంభీపాక నరకమే ప్రాప్తించుననియు, తంత్రములు శాసించినవి. లలిత, అంబ, కాళి లక్ష్మి, సరస్వతి, ఛండి, దుర్గమున్నగు అనేక దేవతలకు ప్రచారాచారములు యేర్పడినవి. దేవతలను బట్టి సంఘములో గూడ కొంతవరకు స్త్రీలస్థితి, గౌరవము వృద్ధియగుటకు సావకాశ మేర్పడెను.

ఈ తాంత్రిక విప్లవమునకు బిమ్మట వెలసిన మతాచార్యులలో శ్రీ రామానుజుడును శ్రీరంగనాథుని (రంగమ్మ మొగుడు) ఉపాసన ద్వారా కొంతవరకు నారీలోకము నుద్ధరించినట్లగుపడును. ఈ శైవ వైష్ణవ సంప్రదాయముల లో శివమార్గములో త్యాగభాగము మెండు_వైష్ణవరీతులలో భోగము పాలు హెచ్చగుటయు యిందలి ఆయా విశేషములలో యింకొకటి.

## మహమ్మదీయ మతము

బౌద్ధమతమునకు పిమ్మట మన నారీలోకమును సమూలముగ గలచి వైచిన అన్యమతములు క్రైస్తవ మహమ్మదీయములు. వీనిలో క్రైస్తవము మహమ్మదీయము కంటె ఆదిమతము (650 యేళ్లుముందు) భారతావనిలో ప్రథమప్రవేశము పదిపదకొండు శతాబ్దములు ముందే యైనను, యిచ్చటి రాజకీయ కారణముల చేతను, అసలా రెండు మతములలోని స్వభావ, స్వరూపములందలి తారతమ్యముల చేతను, యిచ్చట మహమ్మదీయ మొనర్చిన మార్పులు క్రైస్తవమింకను గావింపలేక పోయినది. మన సాంఘిక బలములోనుండి దాదాపు తొమ్మిది కోట్లు ముసల్మానులుగను, రమారమి ఒక కోటి క్రైస్తవులుగను మారిపోయిరి. రాజకీయముగ యిచ్చట బ్రిటిష్ రాజ్యము (క్రైస్తవ) తొలగిపోయినను ముసల్మానులకు ప్రత్యేక పాకిస్థాన మేర్పడినది కాని, యిచ్చటి హైందవులకు మాత్రము మన నాయకులలో యేర్పడిన "నాస్తిక" భావముచే, గాంధీమహాత్ముడాశించిన

"రామరాజ్యము"నకు విభిన్నముగ యొక్క "విమత" రాజ్యమేర్పడినది. భాషలలో క్రైస్తవ భిక్ష మన కిప్పటి ఆంగ్లదాస్యము — మహమ్మదీయ ఫలితము ఉర్దూ భాష.

వీనిలో మహమ్మదీయ మతము మన నారీలోకములో దెచ్చిన మార్పులు చాల ముఖ్యములు, బహుళములు. వీరి "ఘోషా" పద్ధతి నెదుర్కొనుటకై సనాతనులు అతి బాల్య వివాహములను ప్రోత్సహించిరి. వీరి బహుభార్యత్వము యెదుట భారతీయుల ఏకపత్నీ వ్రతము సూర్యుని ముందర దివిటీ వలె వెలవెల బోయి హైందవ సంఘమును జవ విహీనము చేసి వైచినది. మహమ్మదీయుల గానాబజానా భోగములో భారతీయ వైరాగ్యము తుడిచిపెట్టుకొని పోవలసి వచ్చెను. వారి కత్తి, తుపాకీల యెదుట మన "శ్రీరంగనీతులు" (అహింసా పరమోధర్మ వగైరా) సంపూర్ణముగ నిరుపయోగములై పోయినవి. వీనికి పైపెచ్చు తురక రాజ్యమువల్ల మన స్త్రీలకు నూతనముగ యిచ్చినవి ఘోషా యొకటి, మేలిముసుగు రెండవది. కొంచెము మోటుగ జెప్పవలసి వచ్చినచో బౌద్ధమువల్ల మన వారికి "ముండ ముసుగు" లభిస్తే, మహమ్మదీయము వల్ల మనకు "మేలి ముసుగు" లబ్బినది. మహమ్మదీయ రాజ్యములో యిచ్చట వెలసిన బాదుషాలు, నవాబుల యిండ్లలో నవతరించిన "జనానాలు"ను యీ మహమ్మదీయమువల్ల మనకు లభించిన దుష్టతనములలో నొకటియే. కాని యిన్ని దుర్గుణములలో నొక సుగుణము — మహమ్మదీయ సిద్ధాంతము ప్రకారము స్త్రీల కొసంగెడి యేదో కొంత ఆస్తి హక్కు మాత్రము మన నారీలోకమున కొక ఆశా జ్యోతి యైనదని చెప్పవచ్చును.

## క్రైస్తవ ఫలితములు

ఇక క్రైస్తవ సంప్రదాయము మన నారీలోకమునకు ప్రసాదించిన మహా ప్రసాదము లెట్టివనిన:-(1) ఇచ్చటి స్త్రీ పురుషులలో కాలక్రమేణ గలిగిన తారతమ్యమును కొంతవరకు తొలగించి యొక విధముగ సమత్వాశయమును పురిగొల్పుట; (2) స్త్రీలలో విద్యాభిలాష, ఆస్తిహక్కులు, (3) విధవల యెడ మనలో అంతకు పూర్వము ప్రబలిన నీచ్యభావమును కొంతవరకు సడలించుట: (4) సతీసహగమనముల యెడ వైముఖ్యత ; (5) బాల్యవివాహములందు రోతబుట్టించుట, వగైరా. ఇక యీ మతస్థులవల్లా మన కబ్బిన దుష్ఫలితములు:— (1) ముఖ్యముగ మన నిమ్న జాతులలోనుండి విశేషముగ వీరు, మతాంతరులను జేయుట, (2) ప్రేమపేరిట వీరి యథేచ్ఛా వివాహములు (3) మన స్వజాతీయ విద్యలందును, సంప్రదాయములు, రీతులందును అనేక విధముగ ద్వేషభావము కేర్పరచుట - స్వేతరీతుల యందను రక్తి. ఇట్టిపరిస్థితులలో యింకను విగతజీవి కాకున్నను, జీవచ్ఛవమైయున్నది. మన భారత నారీలోకము ఈ లోకమునందలి ముఖ్య లోపము లెవ్వియో, వానిని సవరించి తిరిగి మన నారీమణులను విద్యావంతులుగను, ఐశ్వర్యవంతులుగను శక్తివంతులుగను, ఆయుష్మంతులుగను, జేయు టెట్లు? అను విషయము గూర్చి ముందు వ్యాసములలో చర్చించెదము

# ఆత్మనివేదనము

సాహిత్యసరస్వతి శ్రీ సిరిపి ఆంజనేయులు

2

అత్తఱి, కంబు మహాపర్వతంబు
కడనుండి తరలి, యఖండస్రవంతి
పాండుకూలంకష౧ ప్రబల వేగమునఁ
దిరుగుడుఁ బొందుచు, దిక్కుల తుదల
నావరించుచు, జగమంతయుఁ దాన
యేకప్రవాహమై యెసఁగెడుమాడ్కి,
నుద్వృత్తనమున మహోగ్రరూపమునఁ
జాఁచి తరంగహస్తముల సర్వంబు
లోఁగొంచుఁ బొంగుచు, లోకంబు లోకట
మ్రింగ నేతెంచిన మృత్యువుపోల్కి,
గొఱియల నావులఁ గోళ్ళ నెద్దులను
గడ్డివాముల నిండ్ల కప్పుల బండ్లఁ
గొని, నిమేషంబులోఁ గోసులుగడచి,
బుక్కరాయ సముద్రపుర తటాకంబుఁ
జేరె; నంతయు శాంతిఁ జెదరఁ గొట్టె.
అందు ననంతము లనంతకోటులుగఁ
బుట్టి, పడగలార్చి, బుసకొట్టి, రేఁగి,
కలఁచు తెఱఁగునఁ గల్లోలచయము
కడుభీషణాకృతిఁ గట్టలఁ జీల్చు
మాడ్కి నెసంగ, నిమ్నగ విజృంభించి
కలయు, ననంతసాగరమున నవల
బుక్కరాయసముద్రమున నిండి పొంగి
యలుఁగులఁ బొరలె మహారావ మొలయ.
అచటి కురంగట నాలయమందు
నిద్రించుచుండిన నీర్గట్టువార
లా భీషణధ్వని నాలించి, లేచి,
మరవ౨ దొలికెనంచు మనమున నలరి,
యురవడిఁ బరువిడి యుదధి చందమునఁ
బొరి నీటనురియాడు పూర్ణప్రవాహంబు
వీక్షించి, దరిపయి నివ్వెలనవల
వడిగ నడచి యిరువంకల యొడ్లు
పరికించి యలుఁగులు పట్టక నీరు
దొడదొడ దూఁకుట, తోరంపుగతిని
వఱద పొంగుటయుఁ, బ్రవాహవేగంబు
నిమిషనిమిషమ్మును నెగడుచుండుటయుఁ
గనుఁగొని మనమునఁ గడు బెగడొంది,
'యేమి చోద్యంబొకో యేనాఁడు లేని
యీ పెనువాన నేఁడేల రావలయుఁ
గట్టాఁగునో లేదో కన్నఁజాల" మనుచు
మదినెంచి, పఱచి, గ్రామముసొచ్చి యచట
వెలయు బసిరెడ్డిని వెంగళరెడ్డి
నిద్దుర మేల్కొల్పి యిటు మొఱలిడిరి —
పండ ఋష్వాగ నిండారెఁ జెఱువు;
కట్ట పెల్చెడుజాడ కన్పట్టలేదు;
ఊరుమున్గను మీఱ లూరకయున్న;
గర్జించి యెసరేఁగు గంగమ్మతల్లి
యేమిసేయునో యింక నెఱుఁగము. వేగ
శాంతికి మార్గంబు జరిపింపుఁ" డనిన
నాశ్చర్యమంది పురాధిపు లపుడు
చాటఁబనిచి రట్టె జనులెల్ల వినఁగ.

---

౧. పాండుకూలంకష = పండ మేఱు.

౨. మరవ = అలుఁగు (చెఱువు నిండిన తరువాత మించివచ్చెడి నీరుపోవుట కేర్పఱిచిన త్రోవ.)

3

తమ్మికి నొక్కింత విశ్రాంతి యొసంగఁ
దలఁచినరీతి వానలు నిల్చిపోయె.

గాఢసుషుప్తి మగ్నంబైన జగతి
కోకనదు రేవేళ నొదవినఘోర
కార్యకలాపంపుఁ గల్మిఁ దెల్పుటకొ
యనఁగఁ జీఁకట్లు తమంతన చెదరె;

'లెండులెండో యిదె లేఁబగలొప్పెఁ
గడుపులునిండు మార్గముఁ జూచికొనుఁడు
జనులు మీ' రని మీఱి చాటెడిననఁగఁ
గొలకొలఁ బక్షులు గూసె నెల్లెడల.

'ఆపదలెన్ని తన్నావరించినను
బరహితార్థమె పాటుపడఁ బూను
బుధుఁడు'

అని తెల్పనెంచి యిట్లడరెనో యనఁగ
నీరంధ్ర నిబిడాభ్ర నిచయంబుఁ గడచి
తూరుపుఁ గొండపైఁ దోఁచె సూర్యుండు.

అంత మేల్కనిపౌరు లాలించి వార్త
పిన్నలు ప్రౌఢులు పెద్ద లింతులును
గుంపులుగుంపులై కుతుకంబు దిగులు
నచ్చెరు వెడఁదల నలమికొనంగ

నాబాలగోపాల మా క్షణమందె
యాయగాండ్ర వెనుక నరుగ నిప్పగిది
గ్రామంబె యచటికిఁగదలెనో యనఁగ
నేమెసఁ జూచిన నెడమింత లేక

చీమలపిండుల చెలు వెసలార
సరసిగట్టునఁ జేరె జనసమూహములు.

కిటకిటమంచు మూఁగిన పౌరులందు
నిండినచెఱువును నెమ్మిఁ గనువారు
నలలవడి న్గాంచి యరుదందువారు
నలుఁగులు చెలరేఁగ నడరెడువారు
వఱదమీఱుట చూచి వందుఱువారు
గంగగర్జల కెంతొ కలఁగెడువారు
నామె శాంతిని మనసారంగఁగోరి
పసుపు కుంకుమముల భక్తిఁ బూజించి
నారికేళంబుల నల్లపూసలను

నాకువక్కలను జెవాకుల నూలి
పోఁగుల జోతుల బోనాల విరులఁ
గ్రొత్తచేటలను నెక్కుడు గంచుకముల
గంగమ్మకుం గానుకల నిచ్చువారు

అంశుమత్ఫలముల నర్పించువారు
దధిభాండములఁ బేర్మిఁ దనిపెడివారు
పులగంపుఁ జట్ల నప్పాల నుంచువారు
నయి పొల్చి రచ్చట నతివ లందఱును.

4

ఆ సమయమ్మున నం దొక్క వనిత
యున్నట్టులుండి తా నున్మత్తచిత్త
వలె లేచి, యొకకొంతవడి నూరకుండి
బావురుమని యేడ్చి పక్కున నవ్వె
కను లెఱ్ఱఁబాఱంగఁ గటతటు లదర
వరటిన మెయిఁదీవ వడవడ వడఁకఁ
బల్మెఱుఁ బందులు పటపట గీఁటి
యంతకంతకు భీషణాకృతిఁ దాల్చి
హుంకృతుల్ సెలఁగ మహోగ్రదేవతయ
యీరూపుఁబొందెనో యేమొ యటంచుఁ
దలఁచి, పొంతులు తలఁకి తొట్రిల్ల
నొగి ముందువెన్కల కూఁగుచు, నచటి
పౌరవర్గముఁ గాంచిపల్కె నిప్పగిది.

"ఏను గంగమతల్లి నెఱుఁగరే మీరు ?
పొంగిపొరలుచునుంటఁ బొడఁగట్టనొక్కొ!
పాపసంతతి నొంప భక్తులఁ బెంప
ననయంబుఁ బొల్చు ననంతాత్మఁగానె?

నన్ను మఱచినారె నాథ కర్తలగుచు?
నాకాన్కకై యొక నాతుక వలయు
దాని నాకర్పింపఁ దలఁపుఁడు మీర
లాత్మప్రమోద మేపార సుఖింతు"

రంచుఁ బైనిండిన[3] యా ముద్దరాలు
పడిపోయె మూర్ఛిల్లి ప్రజలమధ్యమున.

గంగయానతి విని కలఁగి చిత్తముల
నేమియుఁ దోఁపమి నెవరికివారు
నెట్టనఁ దమతమ నెలవులు సేర
నరిగిరి భయవిహ్వలాన్వితు లగుచు.

అవల జలము నంతంతన హెచ్చి
గట్టుపైఁ బొరలెడు క్రమము చూపట్టె.

రాయబారము తూము[౪] ప్రక్కఁ
దూరుపునఁ

బదునేనుబారల పరిమితిలోన
గండికపడె; నూర గగ్గోలు పుట్టె;
గుండియల్ ప్రీలఁ బెక్కురు జానపదులు
పశువుల శిశువుల బండారములను

మెలపున సాగించి మెఱకతావులకు
మనబ్రతుకున కింక మార్గ మెట్లనుచు
నటమటించిరి చేత నసువులఁ బట్టి.

(సశేషము)

---

3. పైనిండు = శివమెత్తు.

౪. రాయబారము తూము = అనంతపురసాగరమునం దిది యిపుడు 'కమ్మారివారి తూ' మనఁబడుచున్నది. దీనికిఁ దూర్పునఁ బదునేనుబారల దూరములో, గండిక పడియుండెనని విశ్వసించుట కా భాగమునఁ దటాకతీరము క్రుంగియుండుటయు, గట్టునకు వెలుపలఁ దొలికట్ట కానికగ మలికట్ట నెనికొనియుండుటయు మున్నగుచిన్నెలు నేఁటికిల గానవగును.

# మన నాటకం

## [పంచ వర్ష ప్రణాళికలు]

శ్రీ పోలాకి శ్రీనివాసరావు

---

(డిశంబరు సంచిక తరువాయి)

## నాల్గవ రంగం

[ ప్రదేశము :_మాధవయ్య గృహము

ప్రవేశము :_కమలం గోపాలం రాట్నములతో నూలు వడకుచుందురు.]

— పాట —

గోపాలం:-బిరబిర తిరుగవె రాట్నమ్మా !
చరచర తిరుగవె రాట్నమ్మా !
తరతరములు మము పరిపోషించిన
పరిశ్రమల వర ప్రసాదమా ! ||బిర||

కమలం:_ దేశదేశముల వాసిని గాంచి
యశేష జనమ్ముల పోషణ గాంచి
విశేష భారతపు చిహ్నం బయ్యెడి
శుద్ధ ఖద్దరు సూత్రం బీవె ||బిర||

గోపాల:- కాల ప్రవాహము వమ్ము చేయును,
నూలి ప్రవాహము సాగాధింతును,
కూలద్రోతు నిరుపేద విలాపము,
మేలు జీవనము హాయిగ సలుపుదు ||బిర||

గోవిందం:_(ప్రవేశించి) గోపాలం ! అడుకోనకుండా ఎందుకీపని చేయుచున్నావు ?

కమల:_గోవిందం ! ఏమనుచున్నావు ?

గోవింద:_అమ్మా ! మిమ్ము చూడలేదు. క్షమించండి!

కమల:_నీవంటి పనిలేని సోమరుల కొరకే యిట్టి పరిశ్రమలు నెలకొలపబడినవి.

(తెరలో) పాట

ఏదేశ మేగినా ! ఏయూరు తిరిగినా !
ఏమి తోచాదాయె భగవంతుడా !
ఎట్లు బ్రతుకూ దాన భగవంతుడా !

గోవింద:-అదిగో ! ఎవరో ముష్టిది యిటు వస్తూన్నది.

లక్ష్మి:-(ప్రవేశించును)

ఏదేశ మేగినా ! ఏయూరు తిరిగినా !
ఏమి తోచాదాయె భగవంతుడా !
ఎట్లు బ్రతుకూ దాన భగవంతుడా !
ఈ పొట్ట పోషణకు । ఏదారి తోచదూ
పట్టెడన్నము పెట్టు । వారే లేరా ? _ లేరా ?_
లేరా ?

గోపాల:_ఏమీ ! ఎందుకు లేరూ ? _ ఉన్నారు.

గోవింద:_ఉన్నారు గనుకనే నీవు యింతగా బలిశావు. అడిగికొని హాయిగా జీవిస్తూ నిందించడం కూడానా ?

గోపాల:_మీ అడుక్కొన్న వారిలో నీతినియమాలు లేవు.

గోవింద:-అనాయాసంగా ప్రతిదినం కావలసినంత పైకం చేకూరుతూంటే నీతి నియమాలతో నేమి పని ?

లక్ష్మి:_బాబులూ ! నేను దిక్కుమాలిన పక్షిని. ఇలా అడుక్కొని పొట్ట పోషించుకొంటున్నాను.

కమల:_అడిగికొనవలసిన అగత్య మేమమ్మా ! అంగ బలాన్ని వినియోగించి స్వేచ్ఛగా నీవే సంపాదన చేసికొనగలవు.

గోవింద:_కూలికి పోరాదూ ?

లక్ష్మి:_బాబూ ! కూలిపనులు దొరికితే కదూ !

గోపాల:_కట్టుపని, లేసుపని, పూసలపని, ఊలుపని, నూలుపని, అద్దకం పని, రంగులు వేయడం మొదలగు పనులెన్నో చేసుకొనవచ్చునే !

కమల._తానును స్వశక్తి గలిగియు,
దీనత పేరొకరి శక్తి । తేజము గోరన్
హీనత గాంచక తగు స
మ్మానము బొందంగ నగును । మనుజా ధరలో!
ఇంక నిరుద్యోగులుగా ఎవరూ ఉండరాదని ;

కూడూ, గుడ్డా, నీడా అందరకూ ఉండాలని ప్రభుత్వం తలపోసి కార్యరంగములో ప్రవేశించినది.

లక్ష్మి:-నావంటి పేదవారిని చూచే వారెవరమ్మా?

కమల:-ఇది ఆకాలము కాదు. సమత్వము ప్రకటించు కాలము వచ్చినది. దేశ సంపదలు అందరికీ న్యాయబద్ధముగా పంచబడాలి!

గోవింద: అందరమూ ధనవంతులమైతే పేదవారే ఉండరు గాబోలు! కూలినాలి చేసేవారు కూడా ఉండరు కాబోలు!

కమల:-గోవిందం! త్వరపడతా వెందుకూ? నేను చెప్పెడి విషయాలు శ్రద్ధగా విని నన్నడుగవలసిన వడుగుము.

గోవింద:-అయితే చెప్పండి!

కమల:-భాగ్యవంతుడూ, పేదవాడూ అను తారతమ్యము లేకుండా అందరమూ కాయకష్టమునకు ప్రాధాన్యమిచ్చి సమిష్టిగా కార్యములు చేయవలెను.

లక్ష్మి:-అమ్మా! ఏపనీ లేక, ఎట్టి రాబడీ లేక కష్టపడుచున్న మాలాంటివారికి దారి ఏమైనా ఉందా?

కమల:-మన ప్రభుత్వం మన అభివృద్ధికిగాను పంచవర్ష ప్రణాళికలు ప్రవేశ పెట్టినది. అందు తొలి ప్రణాళిక గడిచి, రెండవ ప్రణాళిక ప్రారంభమైనది.

గోపాల:-ఈ రెండవ ప్రణాళిక కాలములో నిరుద్యోగ సమస్య తొలగుటకు అవకాశా లున్నవి.

కమల:-వినండి, మనదేశములో ఇనుము, బొగ్గు మొదలైన ఖనిజ సంపదలు కొల్లగా లభించుచున్నవి. వీటిని వినియోగించి భారీపరిశ్రమలు, చిన్న పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు నెలకొలిపినారు. ఈ పరిశ్రమలు, గనులు ప్రత్యేకం మున్నగువాటిని గురించి 890 కోట్ల రూపాయలు ఖర్చు చేయుచున్నారు.

గోవింద:-ఆహా! భారీపరిశ్రమ లెలాంటివి?

కమల: రైలు ఇంజన్లు నిర్మాణముచేయుట, నౌకా నిర్మాణము, ఉక్కు పరిశ్రమ, యంత్రపరికరములు, సిమెంటు, ఎరువులు, కాగితములు మున్నగు పరిశ్రమలు.

లక్ష్మి:-చిన్న పరిశ్రమ లెలాంటివమ్మా?

కమల:-50 మందికి తక్కువగల పనివారలతో 5 లక్షల రూపాయలను మించకుండా చేయబడే పరిశ్రమ లన్నింటికి చిన్న పరిశ్రమ లనబడును.

లక్ష్మి:-అలాంటివాటి అవకాశము అందరకూ కలుగదే?

కమల:-కనకనే, చేనేత పరిశ్రమ, గ్రామపరిశ్రమలు, చేతిపరిశ్రమలు, బహుళవ్యాప్తము కలిగించి గ్రామీణులను సైతము పని కల్పించుచున్నారు. ఇందు నూలు నేత, పట్టునేత, ఊలు నేత పరిశ్రమలు; — ఖాదీ నూలు వడకుట, ఊలు వడకుట, ఉన్ని నేతపరిశ్రమ — మరియు వడ్లదంపుడు పరిశ్రమ, గానుగ నూనెల పరిశ్రమ, తోలు పదునుచేయుట, చెప్పుల పరిశ్రమ, బెల్లము-ఖండసారీ పరిశ్రమ, అగ్గిపుల్లల కుటీర పరిశ్రమ, తదితర గ్రామపరిశ్రమలు—

లక్ష్మి:-ఆహా!

కమల:-తేనెటీగల పెంపకము, తాటిబెల్లము, చేతి కాగితములు, సబ్బు, మట్టిపాత్రలు మొదలైనవి. ఇవిగాక, ఆటవస్తువులు, బొమ్మలు, చాపలు, అద్దకములు, పేము వస్తువులు, ఊలు వస్తువులు మొదలైన ఎన్నో రకముల పరిశ్రమలు నిర్ణయించబడినవి.

లక్ష్మి:-ఇవి తయారుచేయడానికి ప్రజలకు కొంత పైకం అవసరం కదా ఎలా లభిస్తుందమ్మా?

కమల:-ప్రభుత్వం, గ్రామపరిశ్రమలు, చిన్నరకం పరిశ్రమల కొరకు 200 కోట్ల రూపాయలు ప్రత్యేకించినది. సహకార సంఘాలద్వారా ధనము, ఆయాపనుల తయారీకి కావలసిన పనిముట్లు, ముడివస్తువులు మొదలైనవి అందుబాటు కలిగిస్తుంది.

గోవింద:-అయితేమి? గ్రామప్రజలు తయారుచేసే వస్తువులు విక్రయమైతే కదూ?—

కమల:-విక్రయ సౌకర్యాల విషయమై తగిన ఏర్పాటులు చేయబడ్డవి.

గో:-అట్లయిన ధన్యులమే!

కమల:-మత్స్య పరిశ్రమకు గూడ ప్రోత్సహించారు.

గోవింద:-పరిపూర్ణంగా అన్నీ అభివృద్ధి చేయుటకు ఉద్దేశించారు.

కమల:-ఈ పరిశ్రమలు మున్నగువాటి వల్లను ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ముగియునప్పటికి 1 కోటి నుండి 1 కోటి 20 లక్షల మందికి ఉద్యోగావకాశాలు కలుగగలవని ఆశింపబడుచున్నది.

లక్ష్మి:-స్త్రీలకు ఆదరణ మున్నదా ?

కమల:-స్త్రీ, పురుషుని అర్ధశరీరమని చెప్పట వినలేదా? జీవనములో పురుషున కెంతపాత్ర గలదో స్త్రీకి నైతమంత పాత్ర గలదు. అన్ని రంగాలలోను స్త్రీ జనాభ్యుదయమునకు ప్రధానము చూపుచున్నారు.

లక్ష్మి:-అమ్మా! అడిగికొని బ్రతికేకంటే, చేతి పనులు చేసికొని బ్రతుకుట మేలు. కనుక, కుటీర పరిశ్రమలు చేసికొని యింక జీవిస్తాను.

కమల:-స్వచ్ఛంద జీవనము మేలుకదమ్మా!

గోవింద:-అమ్మా! ఆరోగ్యానికేమైనా కృషి జరుగుతూందా ?

కమల:-అదేకదా ప్రధానము. విరివిగా ఆరోగ్యసంస్థలు ఏర్పాటు చేయబడుచున్నవి. అన్ని పట్టణములు, గ్రామీణప్రాంతములకు విరివిగా వైద్యసౌకర్యాలు కలిగింపబడుచున్నవి. దేశీయ వైద్యవిధానాలు అభివృద్ధి చేయుటకు 1,100 ఆయుర్వేద వైద్యశాలలు ప్రారంభింపబడుచున్నవి.

గోవింద:-అంటువ్యాధు లెట్లు నిరోధింప బడతాయి.

కమల:-అంటువ్యాధులు అదుపులోనుంచి వాని తీవ్రతను తగ్గించడానికి తలపెట్టబడినవి. మరియు, మంచినీటి సరఫరా, పారిశుధ్యమును పెంపొందించడంద్వారా అంటువ్యాధులను అరికట్టి, దుర్మరణములను తొలగించి జీవితాలను కాపాడుటకు విశేషకృషి సలుపబడుచున్నది.

గోవింద:-మన జీవనప్రమాణం హెచ్చించడానికి ఎన్నైనా అభివృద్ధికార్యాలు చేయాలి!

కమల:-రవాణా, వార్తావాహక సౌకర్యాల కొరకు 1,385 కోట్ల రూపాయలు ఖర్చు చేయబడుచున్నవి.

గోవింద:-చాలా ఎక్కువమొత్తం ఖర్చు చేస్తున్నారే?

కమల:-రైల్వేలు, రోడ్లు, రోడ్డురవాణా, రేవులు — నౌకాశ్రయములు, షిప్పింగ్, కాలువలద్వారా రవాణా, పౌర విమానయానము, ఇతర రవాణాలు, తంతి-తపాలా సౌకర్యాలు, ఇతర వార్తా సౌకర్యాలు, బ్రాడ్ కాస్టింగు మొదలగు నెన్నో కార్యాలు అభివృద్ధి చేయుచున్నారు.

గోపాల:-మనదేశ మొక చిన్న కుటుంబమా? — ఒక పెద్దదేశము. ఇట్టి దేశాభివృద్ధికి ఎన్నైనా కావాలి!

రాఘవయ్య:-(ప్రవేశించి) అమ్మా! నమస్కారము.

కమల:-నమస్కారము.

రాఘవ:-మన 'రామవరం' డెవలప్ మెంటు బ్లాకులో చేరినదట.

గోపాల:-మన గ్రామమే, మన రామవరమే?

రాఘవ:-ఔను; గ్రామసేవక్ గారు వచ్చియున్నారు. ప్రజలందరిని సమావేశము చేయుచున్నారు. మాధవయ్యగారు మిమ్మలను రమ్మన్నారు.

కమల:-సంతోషము. అందరమూ అచ్చటకు పోవుదము రాండి!

అందరు:-సంతోషము.

(నిష్క్రమింతురు)

తెర వ్రాలును

(సశేషము)

# "తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి"

శ్రీమతి కొండా శ్యామలాదేవి

ఆత్మ తత్త్వంబు నెఱిగినయతడు మిగుల
వగవనేరడు చచ్చిన వారి గూర్చి,
వంతనొందడు బ్రతికిన వారి కొఱకు
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

ఇల్లు గాల, వేరొక యింటికేగురీతి
ఉన్న దేహంబు బోవ, వేరొక్క దేహ
మునకు జను దేవా, మోహమ్ముగొనుట దేల
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

చినిగ పాతవస్త్రంబులు, తిరిగి క్రొత్త
వస్త్రములు దాల్చుభంగి ఆత్యాత్మతుడకు
తనువు నశియింప, వేరొక తనువునొచ్చు
అంతియేగాని, తనునాశమందబోదు
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

దుఃఖ సుఖములు కలుగుచు దొలగుచుండు
అవి స్థిరులుగావు: వాని కత్వలనునిలిచి,
సుఖము దుఃఖము సమముగా జూచు తెఱగు
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

భూతముల పుట్టు సావులలోతు దెలియ
రెవ్వరును, దెలియునది వాని రెంటినడుమ
గల బ్రతుకు తెఱవెసుమ్మి నిశ్చలపరాత్మ
తెఱగెరిగి, భూతములయందు మరులువిడువ
తెలిసికొన మో సహోదరి తెలివిగలిగి॥

ఈజగము నావరించిన దేది, నిత్య
మేది, నాశనరహితమై యొసగునేది,
అదియె పరమాత్మ, అవ్యయంబదియె స్థిరము,
మేనులస్థిరములు, దీనిగానువారు
తత్త్వవేత్తలనంబడు ధరణియందు
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి.

ఆ పరాత్మకు జనన మరణాలు లేవు
చంపదది, చంపపడబోదు, జచ్చుతనువు
గాని, చావబోదది నిత్యమైనకతన,
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి.

గాలినిగురదు, నిప్పునగాలబోదు.
నీటదడియదు, బాణాల నిహతిగాదు,
అది అచింత్యము అచలము అజము, పరము
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి.

రాని విత్తాని కాసల రగులబోకు,
ఉన్న దానిని రక్షించుటుడుగు మీవు;
కలిమిలేముల, సుఖదుఃఖములను సమత,
తెలిసి కొనుమో సహోదరి తెలివిగలిగి.

కలుగనిమ్ము ఫలము కలుగక పోనిమ్ము
ఫలముకొఱకు నీవు పాటుబడకు,
కామములను త్రోసి, మమకారమునుగోసి,
కర్మములను జేసి, గాంచుముక్తి॥

తనకు వశమయి, తనయిచ్ఛ కనుగుణముగ
మెలగి, రాగ ద్వేషాదుల మిళితపడని
యింద్రియంబులచే బ్రతుకీడ్చుకొఱకు,
ఎంతగావలె నంతయే యేరికొనుచు,
గడుపుకొనువారి బుద్ధి నిశ్చలతగొనును,
బుద్ధి నిశ్చలత్వముననే బొందు శాంతి
తెలిసి కొనుమో సహోదరి తెలివిగలిగి॥

అలసముద్రుండు భువినదీ జలములెల్ల
లోనికింగొని, చలనంబు నొందనట్లు
తనకు బుట్టిన కోరికలణచు కొనుచు,
కామములగోసి, దుర్మరకారమణచి,
అచలతలు లేని యోగికే అబ్బుశాంతి
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

విషయముల చింతనమునను విషయవాంఛ
బుట్టు, అద్దానకోరికల్ బుట్టుచుండు,
కోరికలు బుట్ట క్రోధంబుగూడ బుట్టు,
క్రోధమున మోహగుణములుకొనలుసూపు
దానచిత్త విభ్రమణంబు దగులుచుండు,
చిత్తవిభ్రమణంబున సెడును బుద్ధి
బుద్ధిసెడునంత సర్వంబు పూర్తిగసెడు
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

బుద్ధి ఆత్మయందును పరిపూర్ణయుక్తి
లగ్నమగుచు, సంకల్ప వికల్పరవాత
మగునో, అదియె సమాధి, అద్దానిగూడ
ఆత్మ పరమాత్మ సమతవ్యవస్థయండ్రు,
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి॥

ఇంద్రియంబులు నిర్జించునెంతవారి
నైన, పరమాత్మ తత్పరులైన వారి
కవి వశంబుగు, అవ్వాని వశమొనర్ప
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి.

తన్నుదానెరుంగుచు, తనలోనదనను
గనుచు, కోరికలను అణచుకొనుచు సుఖము
గోరకయు దుఃఖమునకునై గుందకయును,
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి.

తన్నుగప్పిన మోహంపు తమసు వీడి,
నిశ్చలజ్యోతియై మదినెగడునపుడు,
విన్నదియు, నీవు వినదగు నదియుఫలవి-
హితమనుచు దోచు, కర్మలవినుటవలన
కలతనొందక బుద్ధి నిశ్చలతగొనునో,
అప్పుడే నీవు జ్ఞానంబు నందగలవు
తెలిసికొనుమో సహోదరి తెలివిగలిగి.



కేరళరాష్ట్రంలో రబ్బరు గీత చిత్రము

# నిరుపమ

మూలం : "నిరాల"

అనువాదం : "అరుంధతి"

(గతసంచిక తరువాయి)

## 15

నిరుపమ గ్రామం వచ్చి అప్పుడే వారంరోజులైంది. వచ్చిననాటినుండి గుమ్మం కదలి యెక్కడికి వెళ్లలేదు. నిరుపమ ఆ విధంగా చీకట్లోనేవుండిపోయింది. అదే సమయంలో సురేష్ వెల్తురుచూడటం మొదలుపెట్టాడు. ఊహాచిత్రాలు చిత్రించుకుంటున్నాడు. గాలిలో మేడలు కట్టుతున్నాడు. జమీందారీ యిప్పుడు తన చేతుల్లోవుంది. తాను రెక్కలువిప్పి ఆకాశంలో యెగిరే. స్వతంత్రమైన పక్షి. తనను యిప్పుడు అడిగేవాళ్లెవరూ లేరు. నిరుపమ రెక్కలు విరిగిన పక్షి. తానెంత చెప్తే అంత. అందువల్ల ఆమె నుండి తనకేలాంటి ప్రమాదమూ లేదు. ఆమెపై ఇదివరలో తనకెలాటి అనుమానం కలిగిందో అదే ఋజువవుతోందనుకున్నాడు.

నడి సముద్రంలో తుఫానులో చిక్కుకున్న నౌకలాగ నాలుగు రోజులు గడిపింది ఆమె. నెమ్మదిగా పరిస్థితులను గ్రహించుకుని — తనను తానే ఆ పరిస్థితులకు అన్వయించుకొని తిరగటం ప్రారంభించింది. ఆ నాడు సురేష్‌తో అంది — "నాకేమీ తోచడం లేదు. ఏమైనా పుస్తకాలు తెచ్చిపెట్టు. పైగా యీ జమీందారీ వ్యవహారాలన్నీ నేను తెల్సుకోవాలి. ఇంతవరకు యేం యెక్కడుందో యేమీ తెలియటంలేదు." అలా అనడంలో ఆమె ఉద్దేశ్యమే వేరు. జమీందారీని తిరిగి తన హస్తగతం చేసుకుందామన్న అభిప్రాయం ఆమెకులేదు. తన మనసులో చెలరేగుతున్న ఆలోచనలునుండి తప్పించుకుందుకు యిదొక్కటే మార్గమనుకుంది. జమీందారీ లెక్కలు మొదటినుండి చూడటం ప్రారంభించింది. ఎక్కడచూచినా ఖర్చులేగాని జమలు ఎక్కడా కన్పించటంలేదు. ఆమెకు విసుగేసింది. తండ్రి బ్రతికివుండగా అసలీ ఖాతా పుస్తకాలనేవి వుండేవికావు. పన్నులు మాత్రం యెక్కువచేశారు. కాని వచ్చినరాబడి మాత్రం యెక్కడా కన్పించటంలేదు. అంతా యేమైంది? మొత్తం ఆదాయంలో నాలుగోవంతు మాత్రం పుస్తకాల్లో కన్పిస్తోంది. పెట్టిన ఖర్చులన్నీ లావాదేవీల్లో కన్పిస్తున్నాయి. తండ్రి వున్నప్పుడు ఆయనే స్వయంగా యివన్నీ చూచుకొనేవారు. ఇందులో నిగూఢమైవున్న రహస్యాలు ఆమెకు అర్థంకాలేదు. ఎన్ని దొంగ వ్రాతలున్నాయో యెవరికి తెల్సు?

ఈ విధంగా రెండురోజులు గడిచాయి. ఆ నాడు బ్రాహ్మణుల భోజనాలు. అంతా సందడిగావుంది. భోజనాల యేర్పాట్లు మొదలుపెట్టారు. ఎవరి మటుకువారే తీరికలేకుండావున్నారు. కాని నీలిమాత్రం యిదేమీ పట్టించుకోవటంలేదు. ఈ నాలుగు రోజుల్లోను గ్రామంలోవున్న ఆడపిల్లలకందరికీ నాయకురాలైంది. వీధిలో ఆటపాటలేకాని యింట్లో వ్యవహారాలసంగతి మర్చిపోయింది. సాయంకాలమైంది. వచ్చిన ఆడవాళ్లందరూ లోపల కూర్చుని పాటలు పాడుతున్నారు. ఇల్లంతా చాల గందరగోళంగావుంది. నిరుపమ ఒక మూలకూర్చుని చాల తీవ్రంగా ఆలోచిస్తోంది. ఇంతలో ఒకామె వచ్చి,

"ఏవమ్మా. పెళ్లిపాటలంటే నీకిష్టమేనా?" అంది నవ్వుతూ. సరే పాడమంది నిరు.

"అయితే సరేగాని నీ పెళ్లి యెప్పుడు?"

"తొందర్లోనే"

"ఏం — అంత తొందరగా వుందా?" అంది మరొకామె

"రాత్రిళ్లు నిద్ర పట్టటంలేదు — నక్షత్రాలు లెక్కపెడుతూ కూర్చున్నాను."

ఆ అడిగిన యామె ఫక్కుననవ్వింది. దూరంగా కూర్చున్న అత్తగారు కోడలు నవ్వడం చూచి, "పళ్లికిలించి నవ్వకపోతే నాలుగు పాటలు పాడకూడదూ" అంది. ఆ కోడలు నిరునుచూచి నవ్వుతూ "అంతగా బాధ పడుతున్నారా?" అంటూ పాట మొదలుపెట్టింది.

"పెళ్ళికాబోతోందిగా! యింకా యెందుకు యీ ఆవేదన?" అంది ఒకామె.

"పెళ్ళంటే యిష్టమే ... కాని ..."

"ఊ ... కాని..."

"అన్నీ కుదరవద్దూ"

"అవన్నీ సరేగాని - చేసుకునే వాళ్ళెవ్వరో నీ కిష్టమేనా?"

"ఆ!"

"ఏ వూరు?"

"విదేశాలనుండి వచ్చాడు ..." అంది నిరుపమ నవ్వుతూ. ఆ మాటతో ఆ కోడలి హృదయం కలుక్కుమంది. ఆమె ఆ సమాధానం లోతుపాతుల్ని తరచిచూచింది. ఆమెకేదో అనుమానం వచ్చింది.

"నువ్వెప్పుడైనా అతన్ని చూచావా?"

"ఆఁ చూచాను. అప్పుడప్పుడు మా అన్నయ్యతో మా యింటికి వస్తూవుంటాడు. ఒక్కొక్కప్పుడు యిక్కడే భోజనం చేసేవాడు." అంది నిరు

ఆ కోడలు పనివుందని వెళ్ళిపోయింది. తక్కిన వాళ్లు భోజనాలకు విస్తళ్లువేస్తుంటే చూస్తూనిలబడింది. ఇంతలోనే "ఆఁ ఆఁ" అన్నశబ్దం వినబడింది. లోపల గుమ్మందగ్గరవున్న స్త్రీలందరూ కేకలు పెట్టుతున్నారు. "ఏమిటి? ఏమిటి?" అంటున్నారు సావిట్లోవున్న మగవాళ్లు. "వెధవ మాలవచ్చి వాడు వచ్చిచచ్చాడు" అన్నారొకళ్లు.

"ఇక్కడినుండి పోతావా? వెళ్లగొట్టాలా?" అన్నారు మరొకరు.

ఇదంతా నిరుమాచి దగ్గరకువచ్చింది. వెంటనే "వాణ్ణి ముట్టుకోవద్దు" అంది ఒకామె ఆదుర్దాగా. ఎందుకూ పనికిరాని యీ హిందూ సంస్కారాలతో తాను బంధింపబడింది. తాను నిస్సహాయురాలు. ఎక్కడి వాళ్ళక్కడ శిలాస్థంభాల్లా నిలబడిపోయారు. ఎదురుగా నిలబడ్డరామచంద్ర అతికష్టం మీద 'అక్కా' అన్నాడు. కన్నీరు కాల్వలై ప్రవహించింది. అసలు అతడు నిరుపమకోసం వెతుకుతున్నాడు. చూచి పోదామని వచ్చాడు. అందరూ తలొకవైపు కేకలేసేసరికి ఆద్వారం దగ్గరే నిలబడిపోయి చూస్తున్నాడు. తాను మాలవాడా? ఎవరంటారు? ఎందుకు తాను మాలవాడయ్యాడు? ఆమె అడుగు ముందుకు వెయ్యలేకపోయింది.

"ఏమిటి రామచంద్ర?" అంది నీరు జాలిగా. ఆమె పలుకరించేసరికి అతడు మళ్లీ వెక్కివెక్కి యేడ్వడం మొదలుపెట్టాడు. పాపం పసివాడు. ఆ వాడది అతనికి యెంత అవమానమో తనకూ అంతేనని యెవ్వరూ ఆలోచించలేదు. అయినా గ్రామంలోని వాతావరణం అల్లాగుంది. అతడి కన్నీటి బిందువులు నేలమీద టపటప పడ్డాయి. 'రామచంద్రా' అంటూ ఆమె ముందుకు రావడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించినా అనుమానం మాత్రంరాలేదు. ఆమె దగ్గరగా వచ్చేసరికి అతడిహృదయం తేలికపడింది. ఆమెవచ్చి తన కన్నీటిని తుడిచి ఓదార్చినట్లుగా వుందతనికి. సురేష్‌బాబు దూరాన్నుండి. యిదంతా చూస్తూ నేవున్నాడు.

నిరుపమను చూచి ధైర్యం తెచ్చుకున్నాడు రామచంద్ర. "మేము చాలకృతజ్ఞులం. మీరు నాకిస్తానన్న యిరవై రూపాయిలు మరొక బీదవానికివ్వండి, నాకు కావలసింది మా అన్నయ్యయిస్తాడు. మీరిస్తానన్నది మరొకరికి యిమ్మనమని చెప్పమన్నాడు మా అన్నయ్య" అన్నాడు ఆమె ముఖంలోకిచూస్తూ. "ఈ గ్రామంలో యిప్పడున్న యీ పరిస్థితులవల్ల మేమిక యిక్కడవుండలేము. అందుకు కారణం మీరీపాటికి గ్రహించేవుంటారు. మేము మానూతినీళ్లు పట్టుకెళ్లడంనేరమే ... అయినా, ఆ నూతినిమేమే త్రవ్వించాం. కాని ఆ నుయ్యివున్న స్థలం యీ వాడు మీ ఆక్రమణలోవుంది. అందువల్ల ఆ నూతి నీళ్లు తీసుకువెళ్లడంనేరమే. మీకైతే చేతిక్రిందచాల మంచి ప్రజలున్నారు. నేనైతే ఒక్కణ్ణే. ఉన్నది ఒక్క యిల్లు. ఆ యిల్లుబాగుచేయించడం మొదలైనవి కూడ యికముందు మీరుచూచుకోవలసిందే. ఊరికెళ్లి యీ వేళేవచ్చాను. అమ్మను వాళ్లను తీసుకొనివెడుతున్నాను." అంటూ నిరుపమకు నమస్కరించి తిరిగి చూడకుండా వెళ్లిపోయాడు. ఆమె అతణ్ణి కళ్లతోనే ఆశీర్వదించి అలాగే శిలా ప్రతిమలా నిలబడిపోయింది.

## 16

ఆంతవరకు నిరుపమతో కబుర్లు చెప్పుతూ పాటలు పాడిన అమ్మాయి పాలుపిండాలనే వంకతో యింటికి వచ్చేసింది. కాబోయే తనభర్త విదేశాలకు వెళ్ళివచ్చాడని నిరుపమ చెప్పగానే కృష్ణకుమారను కొంది. అతనితో కలిసి భోజనంచేస్తూ, కలిసి తిరుగుతున్న నిరుపమతో కలిసి భోజనం చెయ్యకూడ

దనుకుని – ఆ శుభవార్త అందరికీ చెప్పడానికి యింటికి వచ్చింది. అప్పుడే పొలాన్నుండి భర్త వచ్చాడు. అప్పటివరకు గొంతుకలో విషంలా దాచి పెట్టిన ఆ వార్తను మొగుడి ముందర రహస్యంగా వెళ్ళగ్రక్కేసింది. "అమ్మగారిక్కాబోయే భర్త విదేశాలకు వెళ్ళివచ్చాట్ట. అందరూ కలిసిభోజనాలు కూడ చేశారట." అంది చమత్కారంగా. "ఆమెతో కలిసి భోజనంచెయ్యటం మంచిదికాదు. ఆమెకూడ అందరితో బాటె కూర్చుంటుంది... ఇలాగే గ్రామాన్ని నాశనం చేస్తారు. మనిషైతే అందంగానేవుంది. మేడిపండులాగ కాని ... నేనేదో పరిహాసంగా అంటే సిగ్గులేక ఆమె యిదంతా చెప్పుకొచ్చింది. ఆమె చెప్పకుండా వుంటే రేపు మన ధర్మమంతా తగులడేది ..."

ఇదంతా విన్న ఆమె భర్త కనుబొమలు ముడిచి మూలనున్న కర్రను తీసుకుని, కిర్రుచెప్పులు తొడుక్కొని బయల్దేరాడు.

"చెప్తున్నాను – యెవ్వరితోను దెబ్బలాడవద్దు" అంది భార్య గుమ్మందిగుతున్న భర్తతో.

"ఛీ నోరుమూసుకుని కూర్చో" అంటూ ధర్మరక్షకుడిలాగ గ్రామ కరణంగారి యింటికి వెళ్ళి చేతిలో వున్న కర్ర నేలమీదకొట్టి, "ఏమయ్యా" అంటూ పిలిచాడు కోపంగా.

"ఏం మహావీర్ రాత్రివేళవచ్చావు?" అంటూ బైటకి వచ్చాడు కరణం.

మహావీర్ పరిస్థితి అంతా విపులంగా చెప్పి, "ఏమంటారు" అన్నాడు.

"సరే అనడానికేముంది. ఊళ్ళోవున్న పెద్దమనుష్యులు నలుగుర్ని పిల్చుకురా. సంగతేమిటో తేల్చేద్దాం" మహావీర్ వెళ్ళి పదిమందినీ పిల్చుకొచ్చాడు. వచ్చినవారందర్నీ చాపమీద కూర్చోబెట్టి తాను చుట్టముట్టించి, "మహావీర్ యేదో చెప్తున్నాడు వినండయ్యా" అన్నాడు.

మహావీర్ విషయాలన్నీ సవిస్తరంగా మళ్ళీ చెప్పి "ధర్మాన్ని నిలబెట్టాలి." అన్నాడు కోపంగా

"మీ అభిప్రాయమేమిటో చెప్పండి" అన్నాడు కరణం. అందరు ముఖాలుచూస్తూ.

"మీరే గ్రామానికి పెద్ద. మీరెంతచెప్తే అంత" అన్ని బాధ్యతలను కరణంగారిపై పెట్టేసి ఒకరిముఖాలొకరు చూచుకున్నారు.

"ఒకరి ముఖాలొకరు చూచుకుందుకుగాదు మిమ్మల్నిక్కడికి [illegible] వచ్చింది. ధర్మ రక్షణచేయడానికి. మీ యెదురుగావున్నది ధర్మంగాని పూర్ణంబూర్లుకావు" అన్నాడు మహావీర్ కోపంగా.

"ఏమిటి దెబ్బలాడుతున్నావా? " అన్నాడో కాయన

"ఏమైనా పిచ్చెక్కిందా?" అన్నాడు మరొకాయన.

"స్నానంచేసి రామాయణం పారాయణ చెయ్యందే యెలామంచినీళ్ళైనా ముట్టుకోమో అలాగే పదిమంది సలహాతీసుకోని గాని యీ విషయంలో యేమీ చెయ్యడానికిలేదు. ఏమండి కరణంగారూ మీరేచెప్పండి?" అన్నాడు యింకొకాయన.

"అవునవును అసలీవిషయాలన్నీ మనకు అనవసరం. మనం విన్నాంగాని చూడలేదుకదా. అయినా పెళ్ళి యిక్కడ కాదుగా జరిగేది. ఎక్కడజరుగుతుందో కూడ మనకు తెలీదు. అయినా ఆమె మన జమీందారిణి. పదిమందినీ పిలిచారు. పిలవడం వాళ్ళ విధి– వెళ్ళడం మనవిధీని. యిందులో తప్పేమీ కన్పించటంలేదు." అన్నాడు నాలుగోవ్యక్తి.

"అదేమంచిది" అన్నాడు ఒకడు. ఆమాటతో మహావీర్ ఉండబట్టలేక పోయాడు. "ఏం పూరీలు, బొబ్బట్లు మాచేసరికి చొంగకారుతోందా?" అంటూ లోకం తొక్కిన త్రాచులా లేచాడు.

"ఏం? అందరిదీ ఒకదారైతే నీదోదారా? ఊరందరిదీ ఒక దారైతే ఉడిపికట్టుదొకదారట – అట్లాగుంది నీ వ్యవహారం. కరణంగారు ఊరికి పెద్ద – ఆయనేదారి తీస్తారు" అందరూ.

"కంటికీ చెవుకీ చాల దూరముందయ్యా" అన్నాడు కరణం నవ్వుతూ." జగన్నాథంలో అనేక జాతులవారు అనేక వేలమంది కలుస్తుంటూ వుంటారు. తర్వాత యెవరిళ్ళకు వాళ్ళు పోతారు. ఎవరి పనులువాళ్ళు చేసుకుంటారు ... పోనీ రైళ్ళలో చూడండి అనేక జాతులవాళ్ళు యెక్కుతూవుంటారు. హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు – అనేకమంది. ధర్మాలు పోతాయని మంచినీళ్ళు త్రాగటం

మానేస్తారా? ఆ ధర్మాలకుకూడ వేళాపాళఅనేది వుంది ... ఆమె మన గ్రామానికి యజమాని. అగ్నితో సమానం. మందేమీ లేదిక్కడ అంతా వారిచేతుల్లో వుంది. వన భోజనాలకు అందరూ పోయి దక్షిణ తెచ్చుకుంటున్నారా లేదా? మరి అక్కడ ధర్మాలు పోవటంలేదు? ఏమిటో ... వాళ్లు జమీందార్లు — మనం ప్రజలు. వాళ్లతో సంబంధాలు త్రెంచుకో కూడదు ...”

“అయితే మాత్రం తినాలనివుందా?” అన్నాడు కోపంగా చేతిలోవున్న కర్రతో నేలమీద పొడుస్తూ.

వీడెవడో మూర్ఖుడిలావున్నాడనుకుంటూ వచ్చిన వాళ్లందరూ జమీందారుగారింటికి భోజనాలకు వెళ్ళి పోయారు. మహాతీర్ ఓడిపోయినా పైకికాక పోయినా మనసులోనైనా పరాజయాన్ని స్వీకరించకుండా - భుజాన్ని కర్ర వేసుకుని ఆలోచిస్తూ వెళ్ళి పోయాడు. ఇంటికిరాగానే భార్యతో అన్నాడు — “అందరికందరూ మాదిగాళ్లే. ధర్మం ధర్మం అంటూనే వున్నారు — ఒక్కడూ నుందుకురాడు. పాలాలు పోతాయేమోనని భయం”

(సశేషము)









విశాఖపట్టణంలోని హిందూస్థాన్ నౌకానిర్మాణ కేంద్రము




శ్రీ పన్నాల సుందరరావు

ఆశాదేవి, బాధగా నిట్టూర్చింది. ఆమె నిట్టూర్పు వెనుక అనేక నిగూఢమైన భావాలు పెల్లుబుకుతున్నాయ్. ఒక్క పల్చనిశరీరం. ఆజానుబాహువు. పొడగరి. కాంతివంతమైన ముఖప్రసన్నత. నుదుట కుంకుమబొట్టు ఆమెలోవున్న భారత నారీత్వాన్ని ప్రస్ఫుటం చేస్తున్నయ్.

శూన్యంలోంచి ఆమె దృష్టి మరల్చి గోడవంక చూసింది. భారతమాత చిత్రపటం, లైటు వెలుతురీ వీరత్వాన్ని చాటుతు కన్పించింది. ఆమె జాలిగొలిపే నయనాలలో కరుణారసం పుట్టి పడుతుంది. సున్నితహస్తాలు దాస్య శృంఖలాలలో బంధింపబడి, కమిలిపోయినయ్. అప్పుడప్పుడే మాత శృంఖాలనుంచి బయట పడింది. కానిఅసలైన స్వతంత్రతా ఆనందం ఆమెలో సంపూర్ణంకాలేదు ఓ ప్రక్క విడగొట్టబడ్డ పాకిస్థాన్, భారత్, ఈ రెండు ముక్కలు, ఆమెను మరీ బాధపరిచాయి. ఇరువురు బిడ్డలు రెండు భాగాలు ఆమెలో పంచుకున్నారు. అన్నదమ్ములిరువురికీ జగడాలు వచ్చేసేయి. ఒక్క తల్లి పాలుత్రాగిన బిడ్డలు. ఒకరంటే ఒకరికి ద్వేషభావం ఏర్పడిపోయింది. ముస్లిమ్‌లు నా బిడ్డలు కాదని అనలేదు తల్లి మీరంటే నాకెక్కువ అనీ చెప్పలేదు హైందవులతో. ఆమెలో సమానత్వం సౌభ్రాత్రత్వం, సర్వజాతి రక్షణ ఇమిడియున్నయ్.

ఆశాదేవి, భయభక్తులతో ఓసారి మాతకు ప్రణామం చేసింది. రాజకీయాల్లో స్త్రీ పాత్ర వహించటం ఆమెకేమంత సబబుగా తోచలేదు అప్పటి పరిస్థితులు చూస్తూవుంటే, తనకేకాదు, యావద్భారత దేశం! యావత్ ప్రపంచమూ తల్లిడిల్లిపోయింది. ఈ హిందువు – ముస్లిం కొట్లాటలు చల్లారే పరిస్థితి, దాన్ని చక్కబెట్టేవిధానం గోచరించక శాంతికాముకులైన, నాయకులు సహితం తల్లడిల్లిపోతున్న రోజులవి.

నాల్గు శతాబ్దాలు దేశం పడరానిపాట్లు పడింది. “సేవావృత్తివలన లభించే పాయసంకంటే స్వచ్ఛంద వృత్తివల్ల లభించే గంజిమేలు” అన్న సత్యం ప్రతివారూ గుర్తించటానికి, వందల సంవత్సరాలే కాలప్రవాహంలో దొర్లిపోయినయ్. ఆస్వచ్ఛందతత్వాన్ని సాధించుకోవటానికి పెద్ద పెద్ద దోపిడీలు కారాగారవాసాలు, లాఠీచార్జీలు, ఉధృతంగా వ్యాపితమయినయ్.

ఇదంతా దేనికోసం ''మాత - సుత'' ఆరెండు పదాలు జీవితానికి మార్గదర్శకాలు. ఆరెండు పదాలలోనే భగవల్లీల ప్రస్ఫుటిస్తుంది. ఏ బిడ్డకూడా, తనతల్లి దాస్యశృంఖలాల్లో బంధింపబడి యుండటం సహించలేదు. తల్లి, కన్నీరుకారిస్తే ప్రపంచాలన్నీ తల్లడిల్లిపోతయ్. అజ్ఞానంలో కొట్టుకులాడుతున్న, భారతమాత సుతులు మేల్కొనేటప్పటికి, వందల ఏండ్లేపట్టినయ్.

నిరంకుశత్వంతో బంధించబడిన భరతమాత హస్తాలు అప్పుడప్పుడే శృంఖాలు విడదీయబడ్డయ్. తనుకోల్పోయిన వీరులనుగురించిన దుఃఖంలోంచి ఆమె ఇంకా ఓదార్పులోనేయుండలేదు. ఇంకా ఇంకా! కుమిలించుతూనేయుంది. అంతలోనే, అజ్ఞానాంధకారంలో కప్పపడిపోయిన బిడ్డల్లో తారతమ్యాలు వచ్చేసినయ్. ఆ ఫలితంగా విప్లవజ్వాలలు దేశంలో వ్యాపించినయ్.

♦ ♦ ♦

ఆశాదేవి హృదయం పరిస్థితుల్ని అవగాహన చేసికునేటప్పటికి తల్లడిల్లిపోయింది. అంతకు క్రితం పదిరోజులముందే తనభర్త, రజాకర్ల తుపాకి గుండుకు ఆహుతి అయ్యాడు. రమేష్ తనకొక్కగానొక్క సుపుత్రుడు. తనబిడ్డకూడా శాంతి సైన్యంలో సభ్యత్వం సంపాదించాడు. రజాకార్ల దుండగాలను, వ్యాపితంకాకుండా శాంతి పంథాలోకి తేవటానికి అనేక సంఘాలు విజృంభించినయ్. కాని అగ్నికి వాయువుతోడైనట్లు - ఆ విప్లవ జ్వాల ఏమాత్రం చల్లారలేదు.

''విప్లవం - విప్లవం!'' ఏమిటా విప్లవం? ఎందుకా విప్లవం??. అదేజాతిబేధం. అదేమతబేధం. ఎవర్ని ఉద్ధరించటానికీ జాతి? ఎవర్ని సుభాగతం చెయ్యడానికీమతం? ఒకే తల్లిబిడ్డలు. ఒకేకంచానభోంచేసిన పిల్లలు. ఒకేతల్లి పాలను గ్రోలిన బిడ్డలు. భీష్మించుకున్నారు. ఏమిటా భీష్మన మేము ముస్లింలం! మీరు హైందవులు. మాది దైవం మీది బొమ్మ.

ఇదే అప్పటి లడాయి. అదే అప్పటి గడ్డుసమస్య. హైందువుంది తాడైతే ముస్లిమ్‌లు తాచుబాముస్నారు. దీనికో విప్లవం బైలుదేరాలి. మనిషిని మనిషిమింగెయ్యాలి. మతాన్ని మతం కాటువెయ్యాలి. జాతిని జాతినాశనం చెయ్యాలి. అవేనినాదాలు మిన్నుముట్టాయి.

ఒక్కసారి, శూన్యంలోకి చూసింది ఆశాదేవి. ఆమె శరీరం అంతా గగుర్పొడిచింది ''పసికందులు చేసే హాహాకారాలు, మానంకోల్పోయిన స్త్రీలుచేసే రోదనాలు, బాకుపోట్లు తిన్నవారు చేసే ఆక్రందనాలు, గర్భాలు చించబడ్డ వీరమాత పుత్రికలు అరచే అరపులు. వీటిమధ్య విప్లవకారులు చేసే వికటాట్ట హాసాలు ఆనందపరిచే చప్పట్లు ఖుషీగా పాడేపాటలు'' అబ్బ! ఒకదాన్నిమించి ఒకటి తలచుకుంటే గుండెలవిసి పోతున్నయ్.

వార్ని వారించటానికి వెళ్ళిన భర్త శవంకూడా గుర్తుపట్టలేనంత క్రూరత్వానికి దిగజారింది. తన అశలన్నీ రమేష్ మీదే కేంద్రీకరించింది అశాదేవి. ఆ బిడ్డకూడా, తండ్రిమార్గాన్ని అనుసరించాడు. ఎప్పుడో ఏ సమయంలోనో శివ! శివ!! ఆకబురూ వస్తుంది. ఇక ఈ ఆశాదేవి కూడా విప్లవ

కారుల దురాగతాలకి అహుతి అయిపో తుంది. స్వర్గంలో భరతమాత వళ్ళోహా యిగా నిద్రిస్తుంది. ఇహ సుఖమంటే అక్కడే లభిస్తుంది. శాంతి అనేపదం, ఆస్థానంలోనే లభ్యమౌతుంది.

డ్రాయరు సొరుగులాగి అందులోంచి రివాల్వరు తీసి, వెలుతుర్లో పరీక్షించింది.

బ్రతకటానికి మార్గాలు చాలాతక్కువే. మారణాయుధాలకు అంతేలేదు. మరణా యుధం! దాంతో పగబట్టి ఒక ప్రాణాన్ని బలిచెయ్యవచ్చు. కాని దేశంలో వ్యాపిత మైన చెడుతనాన్ని ప్రజలలో ఏర్పడిన జాతి బేధాన్నీ మరణాయుధాలు మార్చ గలవా?... లేదు లేదు! ఏమాత్రం జరు గదు. దానికి శాంతి శూస్త్రమేకావాలి. మరి? ఆనాడు ఝాన్సి, కత్తిపట్టి కదం తొక్కలేదా? ఔను! ఆమె శత్రుసేనల్ని చెండాడింది. వీరత్వాన్ని వెదజల్లింది. మానవులంతా ముక్కుమీద వ్రేలేసు కొనేలాచేసింది. కాని; ఈ నాడు భారత మాత కోరుతున్నది శాంతి. నిన్నొకరు హింసించినాసరే హింసించకు. నిన్నొకరు కాల్చినాసరే కాల్చకు. ఇదే శాంతి! ఇదే స్వర్గం!! ఇదే సౌఖ్యం!!!

♦ ♦ ♦

ఇంతలో నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూకిటికీ అద్దంబ్రద్ధలైంది. ఆశాదేవి, ఉలిక్కిపడి అటుగాచూచింది. అంధకారంలో, నల్లని దుస్తులు ధరించిన ఆకారం; మెల్లగానడు స్తోంది. ఓసారి, రివాల్వరు వంక చూసింది. బాధగా నిట్టూర్చింది.

"ఆగు!..." అంటూ రివాల్వరు గురి పెట్టి గర్జించింది. ఆశాదేవి

ఆ ఆకారం ఒక్కడుగుకూడా ముందుకు వెయ్యలేదు. స్థభించి అలాగే నిల్చుండి పోయింది. భయకంపనలతో కాళ్లూ చేతులు గజాగజావణకుతున్నయ్. స్విచ్ వేసివెల్తుతుర్లో, ఆకారాన్ని పరీక్షగా చూసింది. జాలిగా నిట్టూర్చింది. ఆమెలో మాతృత్వం ఒక్కసారి పెల్లుబికింది. మాతృహృదయం తల్లిడిల్లిపోయింది.

"రానాయనా!... భయపడకు దీంట్లో తూటాలు లేనేలెవ్వు? అంటూ ఆహ్వానిం చింది, విప్లవకారుణ్ణి.

అంతవరకూ భయంతో నిండిపోయిన అతని, మొహం క్రూరత్వంతో కమ్ముక పోయింది. పశుబలంతో మీదపడి ఒక్కపే పోటుపొడిచాడు, కైజరుతో, కుప్పగా కూలింది. ఆశాదేవి. "అమ్మా!"... అంటూ, భారతమాత చిత్రం వంక చూసింది.

అతనింకా అక్కడే నిలబడివున్నాడు. అతని హృదయంలో ఏమాత్రం చలనం లేదు. ఏకోశానా జాలి కన్పించలేదు. బీరువావైపు నడిచి, దేనికోసమో వెదుకు తున్నాడతను. ఆమెరక్తంలో పొర్లాడు తూనేవుంది.

అంతలో, బయట వ్యాన్‌లు ఆగినశబ్దం అయింది. టకా, టకా మిలిటరీ బూట్ల ధ్వనివిన్పించింది. అతను, గజగజావణకి పొయ్యాడు. ప్రాణభీతితో అవయవాలే స్వాధీనం తప్పుతున్నయ్ గత్యంతరం తోచక అటూ యిటూ చూస్తున్నాడతను.

"భయపడకు నాయనా! ఇలారావో!"

అంటూ మంచం వైపు చూపింది హస్తాన్ని ఆశాదేవి.

అతను జంకుతూ, భయపడుతూ, మంచం క్రిందనక్కాడు. ఒకచేత్తో పొట్టను పట్టుకుని, వెళ్లి తలుపుతీసింది ఆశాదేవి.

''అమ్మా!'' బాధగా ఆక్రందనం చేశాడు రమేష్ 'తల్లిని కౌగలించుకుంటూ. అతని వెంటనే, మిలిటరీ దళం ప్రవేశించింది.

''అమ్మా! ... నిన్ను కూడా విప్లవకారులు ఆహుతిచేశారా? నిన్ను కూడా ఈ విప్లవ జ్యోతి కాల్చేసిందా తల్లీ'' అంటూ, వాపోయాడు. రమేష్

''జరిగిపోయిందానికి విచారించకు నాయనా! ... అదుగో అలా వెళ్లాడు వెళ్లి వెతకండి! ..''అంటూ పడిపోయింది ఆశాదేవి.

రమేష్ కళ్లు క్రోధంతో నిండిపోయినవ్. యువనరక్త గాఢంగా ప్రవహించింది. తలుపుత్రోసుకుని వీధివెంబడి పరిగెత్తాడతను. మిలిటరీ దళంకూడా అతన్ని అనుసరించింది.

♦ ♦ ♦

''ఇలారానాయనా! .... ''తడబడే స్వరంతో, ఆమె అతన్ని సంబోధించింది.

భయపడుతు లేచి నిల్చున్నాడతను.

''నాడుబాబూ! ..చేసిందానికి విచారించకు. అజ్ఞానపొర కళ్లకు కమ్మినంత మావరకూ మానవుడు పరిస్థితుల్ని విచారించలేడు. ఇందులో, నీవు, నేను, అనే భేదం లేనేలేదు. మహ్మదీయుడు, హిందువుడు యిద్దరూ, ఆ తల్లి బిడ్డలే. జాతులు, మతాలూ మనమానవసృష్టే. దానికోసం హత్యాచారాలు చేస్తే ప్రపంచం నిలువదు. ప్రతీకారం అనేది శాంతి, సూత్రానికి విరుద్ధం నాయనా! ... నీవు నేను, అందరూ కూడా సర్వమానవసౌఖ్యానికి పాటుపడటమే, జాతి, అదేమతం! .. ''అంటూ కళ్లుమూసింది, ఆశాదేవి.

''అమ్మా! .... నన్ను క్షమించుతల్లీ! నన్నొక మానవుణ్ణిగాచేశావ్. నాకొక జాతి, మతం, అంటూ లేదమ్మా. నేను భారతమాత, పుత్రుణ్ణే అనే సత్యం నాకు తెలిసింది. ఇక హత్యాకాండ జరుగదు తల్లీ! ... అంటూ, ఆశాదేవి, రక్తంచేత్తో తీసి నొసట పెట్టుకున్నాడతను. అభిమానంతో హృదయపూర్వకంగా, నమస్కరించాడు, భరతమాత చిత్రానికి.

అంతే! ... ఇక ఆశాదేవి, ఆమెలో లీనం అయిపోయింది. అతను బాధగా నిట్టూర్చి శూన్యంలోనికి మాయమయ్యాడు. భరతమాత చిత్రంజాలిగా కన్నీరు కార్చింది. కాని, అటువంటి పుత్రికలు, శాంతిసాధనకు ఉపయోగపడటమే ఆమె కాంక్షించే లక్ష్యం.

# మతకర్తలు : తద్భక్తిభేదములు

శ్రీ వేదం వేంకట కృష్ణశర్మ

(గత సంచిక తరువాయి)



## నింబార్కాచార్యులు

సూర్యభగవానుని అవతారమని- ప్రఖ్యాతి గన్న నింబార్కాచార్యుని కాలమునుగూర్చి పెక్కు లభిప్రాయభేదములు గలవు. ఆయన ననుసరించు భక్తులతఁడు ద్వాపరయుగమువాఁడని యనుచున్నారు. మఱికొందఱు క్రీస్తుశకము, ఐదవశతాబ్దము మర్త్యలోకమునకు వచ్చెనని వచించుచున్నారు. నవీన పరిశోధకులు- బహుశ్రమతోఁ గష్టనష్టములకు లోనై, అతఁడు— తుదకుఁ క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దమువాఁడని స్థిరపఱచిరి. దక్షిణ హిందూస్థానమందు గోదావరీ తీరస్థమయిన వైదూర్యపట్టణమునకు సమీపమున ఉన్న- అరుణాశ్రమమునందు వసించుచుండిన అరుణముని జయంతీదేవుల కతఁడు జనించెనని ప్రతీతి. కొందఱు విమర్శకులాచార్యుఁడు సూర్యాంశమునఁ గాక, విష్ణుచక్రమగు సుదర్శనాంశమునఁ బుట్టెనని నుడువుచున్నారు. అతనికిఁ బ్రహ్మోపదేశము జరుగు ఉపనయన శుభముహూర్తమునకు దేవర్షి యగు నారదుఁడు స్వయముగ విజయంచేసి, గోపాలమంత్రమును ఉపదేశించి, శ్రీకృష్ణుని అర్చించు రహస్యవిధానము శాస్త్రోక్తముగ వివరించెను. కావున, నారదుఁడు నింబార్కునికి మంత్రోపదేష్టయగు గురువు. ఆ యజ తనయునకు. సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులను నల్వురు అన్నదమ్ములును ఆచార్యులు.

నింబార్కుని మతము ద్వైతాద్వైతము. ఇది క్రొత్త కాదు; పురాతనము నుండియే ప్రజలయాచరణములో ఈ మత సిద్ధాంతములు పరంపరగా వచ్చుచున్నవి. నింబార్కాచార్యుఁడు వ్రాసిన బ్రహ్మసూత్రముల వ్యాఖ్యానమందు నారదుఁడును, సనత్కుమారుఁడు దనకుఁ బ్రామాణికులని పేర్కొనెను.

ఏది యెట్లున్నను- తన విజ్ఞాన పరిపూర్ణశక్తిచేతను, పావిత్ర్యముచేతను, సుగుణగణముచేతను, ఆత్మానుభవముచేతను- తాను కనుగొన్న మతమును మునుపు ఉన్నదానికంటె ఎక్కుడు తేజోవంతముగ సుదీపింపఁ జేసెను.

నింబార్కుని మొదటిపేరు నియమానందుఁడు. అతఁడు ఆపేరితోనే దేవునికిఁ బ్రార్థనములు చెల్లించువాఁడు. అతని మతానుయాయులకు ముఖ్యపీఠమగు దగిన ధ్రువక్షేత్రము యమునానదియొడ్డున గల మధురాపురికి సమీపమునఁ గలదు. అతని ఆశ్రమమునకు ఒకనాఁడు ఒకసన్న్యాసి అరుగెంచెను. (అతఁడు జైన శ్రమణుడని కొందఱు పరిశోధకులు). అపుడాచార్యుఁడును జైనసన్న్యాసియు ఒకానొక మత సిద్ధాంతమునుగూర్చి వాదించుకొనుచుండిరి. ఆవాద విషయమున లీనుఁడయిన ఆచార్యునికి సాయంతనమగుటయు, సూర్యుఁడస్తమించుటయుఁగూడఁ దెలియకుండెను. ఆ చర్చముగియఁగనే అతిథిని ఆచార్యుఁడు తనతో భుజింప నభ్యర్థించెను. కాని, ఆజైనపరివ్రాజకుఁడు, జైనులును, సన్న్యాసులును ప్రొద్దు గుంకిన యనంతర మేమియు భుజింపగాదని శాస్త్రములు నిషేధించుటచేఁ దానేదియుఁ దిననని వాకొనెను. కాని, అతిథి సపర్యయం దెక్కుడు పట్టుదలయు ఆసక్తియుఁగల ఆచార్యుఁడు అతిథిని వదలి తానెట్లు భోజనము చేయఁగలనని విచారమందుచుండెను. అతని దురవస్థ నెఱింగి మనస్సు కరగి భగవతుఁడు ఆచార్యుని నోదార్పనెంచెను. అప్పుడాయన తన భక్తునికి సంతృప్తి గలిగించుటకయిఁ దన మహిమ నావిష్కరించు — ఒకానొకా యద్భుతమానవాతీత కార్య మొనర్చెను. ఆట నప్పుడుండిన జనులు, జైన యోగి, తాను జూచుచుండ — ఆశ్రమములోని నింబవృక్షముఁ (వేపచెట్టు) పైభాగమున ఆకసమున రవి మరలఁ బ్రకాశింపఁ దొడంగెను. ఈ సంఘటన మందఱను ఆశ్చర్యచకితులఁ జేసెను. పరమాత్ముని యనుగ్రహమునకుఁ బాత్రుఁడయిన నింబార్కుఁడు తనయెడ దేవునకుఁ గల కృపాతిరేకమునకు మిక్కిలియు పొంగి — సంతోష సాగరమునఁ దొప్పఁదోఁగుచుఁ దన్నే తాను విస్మరించెను. అత్యంత పర

మానందపారవశ్యమున, అతని శరీరము గగుర్పాటు చెందను. తనమదిని సర్వదా వసించు శ్రీకృష్ణభగవానుడే, అట్లందఱను ప్రత్యక్షముగ మాత్ర భాస్కరుఁడుగఁ ప్రకాశించెనని నింబార్కుఁడెఱుంగును. అప్పుడతడమితోత్సాహముతో అభ్యాగతునితోఁ గూడి కడుపార ఆహార మారగించెను. ప్రభాకరుఁడును దిన్నతిన్నగ నదృశ్యుఁడయ్యెను. అద్భుతమగు ఈ సంభవమువలన—ఆచార్యుఁడు మహా యోగసిద్ధుడను విఖ్యాతి నలుగడల వ్యాపించెను. అప్పటినుండి అతఁడు, 'నింబాదిత్యుఁడు'—'నింబార్కుఁడు' అని ప్రసిద్ధి వహించెను. అతఁడు అనేక గ్రంథములు రచించియుండును. కాని, 'బ్రహ్మసూత్రములు'. 'వేదాంత పారిజాత సౌరభము'— అను ఈ రెంటి భాష్యములు మాత్రమే.

ఇతని శిష్యులలో రెండు తెగలుగలవు ప్రాపంచిక విషయ విముఖులై, కేశవభట్టు నాటి సిద్ధాంతములను పారంపర్యముగ నాచరించువారు మొదటి తెగకు సంబంధించినవారు. హరివ్యాసుని సిద్ధాంతులను వంశక్రమాగతముగ గృహస్థధర్మములను అవలంబించు భక్తులు రెండవ తెగకు సంబంధించినవారు. మొత్తము మీఁద నింబార్కాచార్యుని మతానుసారులు శ్రీరాధాకృష్ణభక్తులు. వారు నొసట గోపిచందనమును ధరింతురు. వారు భాగవతము తమ ముఖ్య పవిత్ర గ్రంథముగ, ప్రామాణికమయిన వేదతుల్యముగ భావించి, గౌరవింతురు. ఆ మత సిద్ధాంతము లింతకంటె నధిక వైశిష్ట్యము గలవేవియో మనకంతగఁ దెలియవచ్చుట లేదు: ఈ మతముయొక్క ముఖ్య సిద్ధాంతప్రకారము :- జీవుఁడు, జగత్తు (సృష్టము), ఈ రెండును విస్పష్టముగఁ బరబ్రహ్మముకంటె వేఱయినవి. అనేక విషయములలో ఈమతము వంగదేశము నందలి వైష్ణవమతమును బోలియున్నది. కాని, కొన్ని ప్రధాన విషయములలో భేదము గనఁబడుచున్నదనుట మఱువరానిది.

## శ్రీకృష్ణ చైతన్య మహాప్రభువు

వంగదేశ వైష్ణమతాచార్యుల మనోభిప్రాయము ఆధ్యాత్మికముగ — మహాప్రభువు (గౌరాంగు) విషయమున నెట్లున్ముఖమయ్యెనో — ఈ వ్యాసమున నించుక స్పృశింతము. అన్ని మతశాఖలలోను, ఆ మతమునకు మూలపురుషులనుగూర్చి తెలుపవలసి వచ్చినపుడు అట్టివారించుమించు భగవదవతారమూర్తులుగనే కొండాడఁబడుట ప్రాయశః సామాన్యమయిన విషయము. కాన, వాస్తవమున కతఁడు దేవుడేయని భావించి యతనినే తన్మతానుయాయులు పూజించుటయు, ధ్యానించుటయు నెంతమాత్రము విడ్డూర మనిపించుకొనదు. అయినప్పటికిని, ఆ మతానుయాయులు నిశితముగఁ బరిశీలించి చూచునెడ, వారికి గౌరాంగుని దైవతత్వానుభూతి పూర్తిగఁ నూత్నమయ తోఁచెడిది. ప్రపంచమున నదివఱకుఁ బ్రచారమునందున్న యే మతస్థులును దమ మతకర్త యొక్క దేవత్వమునుగూర్చి అంతగా వక్కాణించియుండలేదు. ఈ వ్యాసమున అట్టిదానిం గూర్చి యించుక వర్ణితము. అవధరింతురుగాక!

వంగదేశము వైష్ణమత ప్రామాణ్యగ్రంథముగ "చైతన్య చరితామృతము" ప్రఖ్యాతి నందినది. ఈక్రింది శ్లోకము గౌరాంగుని ఆంతరంగిక శిష్యుఁడగు "గోస్వామి స్వరూప దామోదరుఁ" డను నతని దినచర్యా గ్రంథమునుండి గ్రహింపఁబడినది :—

'శ్రీరాధాయాః ప్రణయమహిమా
కీదృశో వా నవైవా
స్వాద్యో యే నాద్భుతమధురిమా
కీదృశో వా మదీయః
సఖ్యంచాస్యా మదనుభవతః
కీదృశం వేతి లోభాత్
తద్భావాఢ్యః సమజని శచీ
గర్భసింధౌ హరీందుః॥'

శ్రీహరి స్వయముగఁ దన ప్రభావాతిశయమున బృందావనమునఁ బ్రత్యక్షమయ్యెను. అతఁడే మరల క్షీరసాగరమునకుఁ జంద్రునివలె నాడియా ప్రదేశమున శచీగర్భాంభోనిధిని దుర్వార విషయలోలుపతాస్ఫూర్తి సఫలమునర్చుకొనుటకు జనియించెను. అతఁడు కోరిన కోరికలు మూఁడు. అందు:-(1) రాధాదేవియొక్క ప్రణయస్వభావమును స్వానుభవముచే గ్రహించి, దాని విలువను నిర్ణయించుట,- (2) నిశ్చలమగు రాధాదేవి మమతలోని మధురిమ లోకాతీతమని యెఱుంగుటకుఁ దానే తొలుదొల్త స్వయముగ దాని గుర్తెఱుంగుట, (3) అభూతపూర్వమగు ప్రేమానంద డోలికల నుఱ్ఱూఁతలూఁగుచున్న రాధాదేవీ ప్రణయపారవశ్యమువంటిది తనకును గలుగుట సహజమని నిరూపించి కృతార్థతఁ జెందుట— ఇది ఈ శ్లోకమునకు

విపులముగను స్వేచ్ఛగను జేయఁబడిన వ్యాఖ్యతోడి యాంధ్రానువాదము.

ఈమూఁడు కోరికలు ప్రోత్సహింప గౌరాంగుఁడు 'నాడియా' మండలమున నవతరించి రాధాదేవి ప్రవర్తనమును రూప సౌభాగ్యమును గుత్తకుఁ గొన్నవాని వలె మెలఁగఁజొచ్చెను.

పవిత్రభూమి యగు మన యార్యావర్తమున భగవంతుఁడు ధర్మసంస్థాపనమును దుష్కృతినిర్మూలనము నొనర్ప నెన్నెన్ని యవతారములు ఎన్నెన్ని విధముల నెన్నెన్నిరీతుల నే యే ప్రదేశముల నెత్తెనో యెంతటివారును గణింపఁజాలరు. "అవతారాహ్య సంఖ్యేయా హరే రద్భుత కర్మణాః" అని భాగవతము వచించుచున్నదిగదా! భగవద్గీతలలోను:-

"యద్యద్విభూతి మత్సత్త్వం
శ్రీమదూర్జిత మేవవా
తత్తదేవావగచ్ఛత్వం
మమ తేజోంఽశ సంభవమ్"

"అర్జునా, మహామహిమోపేతమై శ్రేయస్సంపన్నమై ప్రపంచమున భాసిల్లు ప్రతివస్తువును నా తేజః పుంజకణమని 'యెఱుంగుము'" అని భగవంతుఁడు వాక్రోసెను.

వేదాగమాదికములను అనుసరించి భగవదవతారములు గణనాతీతములు. మన శ్రుతి స్మృతి ప్రముఖ పరమపావనవచనముల విశ్వసించు ప్రతిహైందవునకిది తెలియును. కాన, వానియందుఁ బ్రత్యయమున్న భక్తుఁడు గౌరాంగుని భగవదంశావిర్భూతినిగూర్చి యేమాత్రము సంశయింపఁడు. కాని అతఁ డాయన సంపూర్ణాంశచే జనించెనా? కాదేని ఆయనయందు గల యేదియో యొక భాగముయొక్క అంశచేఁ బుట్టెనా?— యను విషయముంగూర్చి అభిప్రాయభేదములున్నవి. వంగదేశ వైష్ణవులందప్పఁ దక్కిన తెగలవారు, విష్ణువునందు విశ్వాసము ఉన్నవారు, నిరంతర భగవదర్చకులు మున్నగువారు, చైతన్యునిఁ గంటికిఁగాని, మనస్సునకుఁగాని గోచరించు భగవదంశగా అంగీకరింపరు. కాని, వంగదేశమున అతఁడు మర్త్యలోకమునందవతరించినవాఁడని పెక్కుర అభిప్రాయము. ఆ దేశమందలి మతాచార్యులు (వైష్ణవులు) తాము అతనిని సంపూర్ణవిష్ణ్వంశతోఁ బుట్టినవాఁడని ఋజువుపఱచుటకు ఆధారముగఁ బైశ్లోకము నుదహరింతురు. కాన, నేను పైశ్లోకవిషయములను శక్తి కొలఁది గ్రహించి నావ్యాసమున కాధారముగఁ జేకొంటిని. కాన, దాని గర్భితాభిప్రాయమును బయలు పఱుపఁ దీర్మానించికొంటిని. భగవద్వాస్తవిక స్వభావమునుగూర్చి చర్చించు మహాత్ములలోఁ గొందఱాయన ఆధ్యాత్మిక విజ్ఞానపథమునకుఁ గారణభూతుఁడందురు. మఱికొందఱు భక్తిమార్గమున కాయనయే మూలాధారమందురు. జ్ఞానసంపన్నుల దృష్టిలో భగవంతుఁడు సర్వశక్తిసమవేతుఁడు. అనగా, ఈలోకమునఁ దామేమి యొనర్చినను, అట్టిదానికెల్ల భగవంతుఁడే కర్త. మఱొకరీతి వ్యాఖ్యానించుచో, ఆయన అంతటను వ్యాపించినవాఁడగుటచే మన ప్రయత్నములకెల్ల ఫలితములు ఆయన హస్తగతములే. అతని ప్రేరణము లేకుండ మన యత్నములు నెఱవేఱఁజాలవు. జ్ఞానమార్గమున ఆయనను గనుగొన నెంచువాఁడు వేదాంతమునేని, వస్తుతత్త్వవిచారమునేని ఆశ్రయింపవలెను. ఎవ్వఁడు హేతువాదము నాశ్రయించి, దేవుని ఎఱుంగునో— ఎఱుంగ జతనమొనర్చునో—, అతఁడు పరతత్త్వమే తన యుద్యమములకుఁ దగిన ఫలము లొసంగుననుటలో సందియ మిసుమంతయు లేదని తీర్మానించుకొనును. అందుల కాతఁడు జీవగమ్యస్థానముపై ఆధారపడును. జీవాత్మకు సంబంధించిన కష్టసుఖముల గమ్యమును గూర్చిన విచారము లేకుండ ఏదియు నొనర్పనెంతటి శక్తిసంపన్నుఁడుగ నుండఁడు. అగోచరమగు అగమ్యముయొక్క మహిమాతిశయముంగూర్చి వర్ణించుట మిగులదుష్కరము. నైయాయికులును మీమాంసకులును ఆగమ్యమునే దైవప్రభావమని ప్రకృతిప్రభావమని దుర్వారవిధి (కర్మ) అని యందురు. ముముక్షువులలో గొందఱు దానిని 'మాయ' అని —'అవిద్య' అని వచింతురు. బృహస్పతి మతానుయాయులగు చార్వాకులు, దానిని ప్రకృతి స్వభావమని వచింతురు. అది ప్రకృతియో అవిద్యయో విధియో మాయయో దానిని కాదని భగవంతుఁడేని - ఒక ప్రాణిని నిర్మూలింపఁడు; — బ్రతికింపఁడు. ప్రాచీన వేదాంత రహస్యజ్ఞులగు ఆచార్యులెల్ల భగవదాస్తికతను గుర్తెఱిఁగి, తుట్టతుదకు దాని సర్వాంతర్యామిత్వమును స్థిరపఱచిరి.

జ్ఞానయోగులు భగవంతుని యునికిని తెలిసికొన్నంతమాత్రమున సంతృప్తి నొందిరో లేదో నిర్ణయించుకొనుట వారిలోనే యున్నదనుట సత్యము. ఏదో కొంత పరిమితమయిన శక్తి గలిగిన అపరతత్త్వమునకు భక్తియోగులు వినమ్రులై లొంగియుండరు

భక్తియోగప్రభావము నుగ్గడించు ఆగమాదులు భక్తుఁ డెట్టిరూపము గలవానిగఁ దనమనోమందిరమున నెల కొల్పుకొనునో ఆరూపముతోనే అతనికిఁ బ్రత్యక్ష మగును మన స్ఫూర్తిగ ఆరీతి సేవించు భక్తులెల్ల విషయములందును దనివి నొందునట్లు దేవుఁ డొనరగలఁడు. భాగవతమున "భక్తిభావ పరి భావిత హృత్సరోజే ఆస్సే శ్రుతేక్షిత పథోననునాథ పుంసాయ్ యద్యద్ధియాత ఉరుగాయ విభావయన్తి తత్తద్వపుః ప్రణయసే సదనుగ్రహాయ." "ప్రభూ, భక్తియోగసిద్ధుఁడగు మహాత్ముని సంపూర్ణముగ వికసించిన హృత్సరోజమున అతని భక్తియోగానుభవముచే నెల్లప్పుడు వసించి యతనికిఁ బ్రత్యక్షమగు చుందువు వ్యర్థములగు చర్చలు హేతువాదములు, నన్నుఁ గనుఁగొను మార్గమున కెన్నఁడును నడుపఁ జాలవు. శ్రుతుల మూలమునను సద్గురూపదేశముల మూలమునను, గొన్ని నియమముల ననుసరించి, ఆధ్యాత్మికముగ నభివృద్ధి పొందినవారే నీమహోన్నత మార్గముం గ్రహింపఁగలరు. దేవా భక్తుఁడు నిన్నే రూపమునఁ బ్రేమించి ధ్యానించునో ఆరూపముననే అతనికిఁ బ్రత్యక్షమగుదువు. అట్లు నీవు భక్తహితైషివై ఈలోకము నుద్ధరించుచో—పుణ్యాత్ముఁ డెవఁడు? పాపాత్ముఁ డెవఁడు? నీదృష్టియందు ఆ యిరుదెగల వారును సమానులే ఆయుభయులును నీకృపాను భూతికిఁ దుల్యులే"

# విజయ విజ్ఞానం

శ్రీ వి. యల్. రాధ

విజయ అప్పుడే నిద్రలేచింది. ఇంట్లో అంతా గందరగోళంగా ఉంది. విజయకేమీ బోధపడలేదు. ఇల్లాంతా నాలుగైదుసార్లు కలయతిరిగింది. ఎవరి పనుల మీద వాళ్లున్నారు. ప్రతివారికీ నిలబడి మాట్లాడే తీరికే లేనట్లుగా నడుస్తూనే ప్రతి వాళ్ళూ ప్రతివాళ్లకూ పనులు పురమాయిస్తూనేయున్నారు. కాని చేసేదెవరు? విజయకిదంతా అగమ్యగోచారంగాఉంది. పదేళ్ల పసిహృదయానికి ఈ తతంగమంతా తెలుసుకునే తాహతెక్కడిది? బిక్కు బిక్కుమంటూ ఇల్లంతా తిరుగుతుంది. ఎవరిపనులు వారు చేసుకొనే వారేగాని విజయను పలకరించిన దిక్కే లేదు.

విజయకు విసుగుపుట్టింది. సరాసరి అక్క గదిలోకెళ్ళింది. ఆమె గారు తెలియని తన్మయత్వంలో తలగడమీద తల ఆన్చి మదిలోని మధురానుభూతులను తలచుకొని తనలో తానే నవ్వుకొంటూంది. విజయగదిలో కెళ్ళి 'అక్కాయ్' అని రెండుసార్లు పిలిచింది. 'ఉహు, ఆమెపలికితేగా' విజయలోని విసుగు అంతిమస్థాయినందుకొంటూంది. ఇహ మాటలతో లాభములేదనుకొని అక్కాయ్ చెవిలో కాసిని సిళ్ళుపోసింది. "ఛీ! ఫోవే మొద్దుముండా" అంటూ ఆమె అమాంతంగా ఈ లోకంలోవచ్చి విజయను ఒక మొట్టికాయ మొంది.

విజయకు కళ్లనీళ్ల పర్యంతం అయింది.

"అక్కాయ్! ఏమిటివ్వాళ మనింట్లో" అంది విజయ.

ఆమె తిన్నగా ముసిముసి నవ్వులునవ్వుతుంది. తన ప్రశ్నకు జవాబు చెప్పకుండా అక్క ఎందుకు నవ్వుకుంటుందో విజయకు బోధపడలేదు. మళ్ళీ అడిగింది.

ఆమె పలుకే బంగారమయినట్లుగా "ఇవాళమనింట్లో పండుగ" అనిఒక్క మాట చెప్పి యూరుకుంది.

"మొన్నేగా సంక్రాంతి పండుగ వెళ్ళిపోయింది. అప్పుడే పండుగేంటి" అంది విజయ.

"అంతేలేవే మొద్దుమొఖమా! ఇవాళ పండుగగాని పండుగ – మరో పెద్ద పండుగ" అంది అక్క 'పిల్లి అంటే మార్జాలము' అన్నస్థితిలో ఉంది మన విజయపరిస్థితి. బిక్క మొగము పెట్టింది,

అక్కకు విజయను చూచేసరికి జాలేసింది.

"ఇటురావే మొద్దూ. ఇవాళ నా పండుగ" అంది అక్క.

అక్క శాంతంగా చెబుతుంటే విజయకు ఉత్సాహము కలిగింది.

"నీపండుగయితే నా పండుగ గాదేంటి!

అక్క పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వి

''నీపండుగ ఇంకోపది సంవత్సరాలు పోయి నాక చేసుకుందువుగానిలే'' అంది.

''ఎందుకేంటి - మొన్న సంక్రాంతికి నువ్వు తలంటు పోసుకున్నావు; నేనూ పోసుకున్నాను. నువ్వు కొత్తగుడ్డలు కట్టుకున్నావు; నేనూ కట్టుకున్నాను. ఇవ్వాళ నువ్వుపండుగ జేసుకుంటున్నావు. నేనూ జేసుకొంటాను''

అక్క అయిన అరుంధతి కేమి చెప్పాలో అర్థంగాలేదు.

''అది గాదే విజయా! ఇవాళ నా పండుగ. అంటే పెళ్ళిలాంటి మరో పెద్ద పండుగ'' అంది అరుంధతి.

''అయితే నువ్వు పెళ్ళిచేసుకొని నాలుగైదునెల్లేగా అయింది. మళ్ళీ పెళ్ళిచేసుకుంటున్నావేంటి. అప్పుడు తాతయ్యా, మామయ్యా వాళ్ళందరూ వచ్చారుగా- ఇవాళ రాలేదేం''

విజయకు సమాధానం జెప్పటానికి అరుంధతికి మాటలే దొరకలేదు.

''వాళ్లెవరూ ఇవాళ రారులేవే-వాళ్లు రాకూడదు. ఇవాళ ఆడవాళ్ళ పండుగగాని మగవాళ్ళపండుగకాదు'' అంది అరుంధతి.

''అయితే బావొచ్చాడెందుకు'' తర్కీమని అడిగింది విజయ.

''పోవే. నీకు చెప్పేసరికి తలప్రాణం తోకకు వస్తుంది.'' అని విసుక్కుంది.

''నువ్వు జెప్పకపోతే అమ్మ చెప్పదనుకున్నావా! అమ్మను అడుగుతానుండు'' అని విజయ తుర్రుమంది. విజయ మళ్ళీ వస్తే బావుండును అని అనుకొంది అరుంధతి.

విజయ తల్లి దగ్గర కెళ్ళింది. ఆమె అమ్మలక్కలతో మాట్లాడుతూ వుంది. ఏమిటో చెప్పుకుని వాళ్లందరూ నవ్వుకొంటున్నారు. విజయకి దేమీ అర్థంగాలా.

''ఏమిటివ్వాళ. అమ్మా! మనింట్లో'' అని విజయ తల్లినడిగింది. ఆమె నవ్వుతూ ''ఇవ్వాళ అక్కయ్య పండుగ''అంది.

అమ్మలక్కలందరూ ఒక్కసారి నవ్వారు.

''అక్కయ్యకు పండగయితే నాకూ పండగేగా! అక్కయ్య తలంటు పోసుకుంది! కొత్తగుడ్డలు కట్టుకుంది. నాక్కూడా తొందరగా తలంటిపోయవే. నేకూడ కొత్తగుడ్డలు కట్టుకుంటాను'' అంది విజయ క్రొత్తగుడ్డలు కట్టుకోవచ్చు అనే సంబరంతో.

'ఫో! విజయా అవతలికి పో. నీమొగుడొచ్చాక నీవు నీపండుగ జేసుకుందువుగానిలే''అని అమ్మ కసరుకొంది.

అమ్మకంటే అక్కే నయమనిపించింది. మళ్ళీ అక్కదగ్గరకు వచ్చింది.

''మరే ... అక్కయ్య .. ఇవాళ నీ పండగ. అమ్మకూడా నాతో చెప్పింది, నా పండగట నా మొగుడొచ్చి నాక జేసుకోవాలట. నీ పండుగయితే బావెందుకొచ్చాడక్కయ్యా'' అని విజయ వినయంగా అడిగింది.

అక్కదగ్గరనుంచి చిరునవ్వు తప్పమరే సమాధానము రాలేదు.

విజయ మళ్ళీ అడిగింది.

అరుంధతి విసుగుతో "ఏమో - ఎందుకొచ్చాడో వెళ్ళి మీ బావనే అడగ రాదూ! నన్నడుగుతావెందుకు!" అంది.

"మా బావ బలేమంచాడు. నేనడిగిన వన్నీ చెబుతాడుగా-వెళ్ళి మా బావనే అడుగుతానుండు" అని విజయ బావగారి గది లోకి తుర్రుమంది. విజయ నిజంగా బావను అడుగుతుందేమోనని భయంతో అరుంధతి విజయను బిగ్గరగా కేకేసింది. విజయ ఎప్పుడో బావగదిలో కెళ్ళిపోతే ఈమాట వినే దెవ్వరు ?

విజయ బావగారి గదిలో కెళ్ళేసరికి ఆయన ఫుల్‌సూటుతో మేకప్ అవుతున్నారు. విజయ బావను పిలిచింది,

"బావా......"

"ఏం మరదలు పిల్లా! ......మీఅక్క పంపిందా"

"మరే.. మరే...ఇవాళ మా అక్క పండుగట మరినువ్వొచ్చావెందుకు ?" ఆనందరావు నవ్వకుండా ఉండలేక పోయ్యాడు.

"ఎవరు చెప్పారు ... ఇవాళ మీ అక్క పండుగని "

"మా అక్కే చెప్పింది. ఇవాళ ఆడ వాళ్ళ పండగట! అందుకని మా తాతయ్యా మామయ్యా వాళ్ళురాలేదట. అయితే నువ్వెందుకు వచ్చావు ? "

"మీ అక్కయ్య పండుగెలాచేసుకుంటుందో చూద్దామని - ఏం రాకూడదా?"

"మొగాళ్లు రాకూడదుగా. ఇది ఆడ వాళ్లపండుగ్గా"

"ఇది ఆడాళ్ళ పండగయితే మట్టుకు నేనులేకుండ మీ అక్కయ్య పండుగెట్లా చేసుకుంటుంది."

అంటే ఏమిటో విజయకు అర్థంగాలా

"ఏం ఎందుకు చేసుకోదేంటి. తలకు నీళ్ళు పోసుకొంది. కొత్త గుడ్డలు కట్టుకుంది. అది పండగ కాదా ఏంటి?"

"సరే నేను వెళుతున్నాలే"

"ఎక్కడికి?"

"సినిమాకి"

"అమ్మ దొంగా... సినిమా కెళ్తానికే నా కొత్త గుడ్డలు తొడుక్కున్నావు. నే కూడా వస్తా బావా! భలే భలే సినిమాలు ఆడుతున్నాయి."

"నువ్వు ఒక్కదానివే వస్తావా... మీ అక్కయ్యను కూడ తీసుకు రా వూ" అన్నాడు.

"వద్దు బావా... మా అక్కయ్యవద్దు. అదెప్పుడు సినిమా కెళ్ళినా నన్ను తీసుకెళ్ళదు. ఇవాళ మా అక్కయ్యపండుగ్గా-పండుగ చేసుకుంటుందిలే."

విజయ అమాయకత్వానికి ఆనందరావు తనలో తానే నవ్వుకొన్నాడు.

"విజయా! సినిమా కెళ్దాం. లే.... మరి మీ అక్కయ్య నడిగి సినిమా కెళ్ళనుంటుందో వద్దంటుందో కనుక్కురా."

"అక్కయ్య సినిమాకి వెళినప్పుడల్లా నిన్నడుగుతుందేమిటి నీవు వెళ్ళేప్పుడు అక్కయ్యను అడగటానికి."

"ఇవాల్టినుంచి అడుగుతుంది గా" అన్నా .

ఇవాల్టినుంచి అక్కయ్య సినిమాకు వెళ్ళేటప్పుడు బావను ఎందుకు అడుగుతుందో విజయకు తెలీలా.

"సరే బావా...అక్కయ్యను అడిగి కొత్త గుడ్డలు తొడుక్కొస్తాంనుండు." అంటూ విజయ.

"అక్కా! అక్కా! ... " అక్కగారి గదిలోనికి పరువెత్తింది.

ఆమేదో దీర్ఘాలోచనలో నున్నది. తానింక కొన్ని గంటలలో భర్త సాన్నిధ్యంలో ఉంటుంది. ఆయనతో తనెట్లా మాట్లాడాలి! అందులో మగవాడు! తానింతవరకు పరాయి మగవాడితో మాట్లాడి ఎరుగదు. తాను స్కూలులో చదివేటప్పుడు కనీసము తోటి విద్యార్థులతో నన్నా మాట్లాడి ఎరుగదు. అటువంటప్పుడు ఒక్కసారిగా ఇంతవరకూ పరాయివాడైన తన భర్తతో ఎలా మాట్లాడటం ఒక్కసారి అరుంధతి గుండెలు దడదడలాడినవి. అంతలోనే ఒక మధురహాసరేఖ ఇట్టే మెరచినది. ఆమెకు తెలీకుండానే ఆమె నవ్వసాగింది. ఒకవేళ 'వారే' ముందు మాట్లాడింతురా! ఏమని మాట్లాడుతారు? 'నీపేరేమిటని అడుగుతారా' 'ఛీ! ఏమిటీ చచ్చుప్రశ్న' నా పేరు తెలీకుండా నన్నెట్లా పెళ్ళాడాడు. ఈ ప్రశ్న అడగరు. ఇంకేమని అడుగుతారు.

'నా మీద ప్రేముందా' అని అడుగుతారా. 'ఛీ! ఏమిటీ చొప్పదంటు ప్రశ్న'! వారిమీద ప్రేమలేకపోతే నేనెట్లా చేసుకొంటాను. ఈ ప్రశ్న అడగరు. ఇంకేమని అడుగుతారు. ఆ! ఏదో ఒకటి అడుగుతారెద్దూ. ఏమీ అడక్కుండా వచ్చి ఒక్కసారి నన్ను పట్టుకుంటే "చూడవే అమ్మా" అని ఒక్కసారి కేకేస్తాను. "అవుతుంది అబ్బాయిగారి పని అంతటితో" అని అనుకొంటూంది అరుంధతి వచ్చే నవ్వును ఆపుకోటానికి శాయశక్తుల ప్రయత్నిస్తూ.

ఈ ఆలోచనలతో అరుంధతికి విజయ అరుంధతి చెవిలో బిగ్గరగా "అక్కయ్యా" అని అరచింది.

అరుంధతి ఒక్కసారి త్రుళ్ళిపడిలేచింది

"అక్కయ్యా... నేనూ బావా సినిమాకెళ్తున్నాము"

"ఎవరు చెప్పారు?"

"బావే చెప్పాడు. బావ వెళ్తున్నాడు. నన్ను కూడ తీసుకెళ్తాడట."

"పోవే మొద్దూ., ఇవాళ సినిమాకి వెళ్ళకూడదే"

"ఏం ఎందుకని వెళ్ళకూడదు?"

"అంతే వే .. ఇవాళ బావగారు సినిమా కెళ్ళరే, అసలు వెళ్ళకూడదే..."

"ఎందుకని అక్కయ్యా "

"పో! మొద్దు ముండా! నీకేం తెలీదు" అని అరుంధతి విజయను కసరి కొట్టింది,

విజయ కిదంతా అయోమయంగా ఉంది. ఏమీ అర్థంగాలా. బిక్కమొహంతో అక్కగారి గదినుండి బయటికి వెళ్ళిపోయింది.

పాపం! ఇవేళ అక్కను బావను గదిలోకి పంపుతారని విజయ తెలుసుకోలేక పోయింది.

# ఎన్నో పరిశ్రమలు



## మెట్రిక్ పద్ధతి అవలంబిస్తున్నవి

1958 అక్టోబరు 1 వ తేదీన మెట్రిక్ పద్ధతి ప్రవేశపెట్టబడిననాడే దేశంలోని అనేక ముఖ్య పరిశ్రమలైన జనపనార, ఇనుము–ఉక్కు, వస్త్రాలు, సిమెంటు, కాగితం, ఉప్పు, కాఫీ, ముడి రబ్బరు, ఇంజనీరింగు, అయోరహిత లోహాలు మొదలైనవి ఈ పద్ధతి తూకాలు, కొలతలు అవలంబించ మొదలుపెట్టినవి.

అప్పటినుండి అనేక ఇతర పరిశ్రమలలో కూడా క్రమంగా ఈ పద్ధతికి పరివర్తన ఆరంభమయినది.

1959 అక్టోబరు నుండి కొబ్బరిపీచు పరిశ్రమలో ఈ పద్ధతి ప్రవేశపెట్టడానికి అనుమతి ఈయబడింది. పంచదార పరిశ్రమలో 1959 నవంబరు 1 వ తేదీ నుండి ఈ పద్ధతికి పరివర్తన ఆరంభమయినది.



వనస్పతి, పెయింట్లు పరిశ్రమలు కూడా 1960 ఏప్రిలు నెలనుండి ఈ పద్ధతి అవలంబించడంతో క్రొత్త అధ్యాయం ప్రారంభమవుతుంది.

1960 ఏప్రిలు 1వ తేదీనుండి పెట్రోలియం, తదితర పెట్రోలియం పదార్థాలు, లీటర్లు, ఇతర మెట్రిక్ కొలతలలోనే కొలవడం జరుగుతుంది.

> 1960 ఆగస్టు నుండి ఈ పద్ధతి కస్టమ్సు, సెంట్రల్ ఎక్సయిజు శాఖలలో కూడా అవలంబింపబడుతుంది.

మార్పు మన మంచికే

# మెట్రిక్ పద్ధతి

అంతటా ఒకే పద్ధతి - ఎంతో సులభమైనది
భారత ప్రభుత్వంవారిచే జారీ చేయబడినది

DA 59 432

(53_వ పేజీ తరువాయి)

అప్పటికీ ఒకమూల అవధాన్లు హెచ్చరిస్తూనే వున్నాడు.

"ఆ సుబ్బయ్యను విడిచామో ఈ వూళ్లో పడుచు పిల్లలను అగచాట్లే" అని ఎక్కబొడుస్తున్నాడు.

సుబ్బయ్య వూర్నించి వచ్చాడు. ఏదో పనిమీద బెజవాడ వెళ్లాడట. ఊర్నించి వస్తూనే ఈమాట విని తన విషయం కానట్టు వుండిపోయాడట. ఈ చోద్యం విన్నవాళ్లంతా ముక్కుమీద వేలేసుకున్నారు.

"అయితే సుబ్బయ్యకేమీ తెలీదంటావా?" అని ఒకరు.

"ఇదంతా నాటకం" అని మరొకరు.

ఎవరికివారు గుసగుసలు చెప్పుకొంటూ వుండిపోయారు. ఊరిపెద్దల్లో ఒక్కరూ సుబ్బయ్య ఎదుటికొచ్చి అడిగినవాళ్లు లేరు. వాళ్లంతా చేరి ఊర్నుంచి వెళ్లగొడ్తారని విని సుబ్బయ్య నవ్వుకున్నాడు.

♦ ♦ ♦

"ఆ పిల్ల లేచిపోయింది. నేనెప్పుడో చెప్పలా" అంటూ విరగబడి నవ్వాడు అవధాన్లు.

దానితో పిచ్చయ్య, సుబ్బారాయుడు విస్తుపోయారు. నాయుడు అందుకొని "లేచిపోయిందీ - సుబ్బయ్యతో నేనా?" అన్నాడు.

"ఆఁ హాయిగా వెళ్లిపోయింది. సుబ్బయ్య ఇంటికి తాళంవేసి రాత్రికిరాత్రి లేవదీసుకు వెళ్లాడు దాన్ని."

విజయగర్వంతో ఊగిపోతూ అదోలా పోజు పెట్టాడు అవధాన్లు. కొత్త ఆలోచనలకోసం చిటికెడు నస్యం ఘాటుగా పట్టించి:

"దాన్ని పట్టుకొని మహాగుణవతి అంటాడే సుబ్బారాయుడు" అన్నాడు హేళనగా. సుబ్బారాయుడు కిక్కురుమన లేదు.

"ఇప్పుడేమంటాడు రామయ్య!! తనకూతురు ఏమీ తెలియని బిడ్డని ఆవేళ అన్నాడు మనమంతా ఏదో నిందవేస్తున్నట్లు" అవధాన్లు నోటికి అడ్డులేకపోయింది. కంసాలి సుబ్బయ్య నిస్సందేహంగా దోషి అని నిర్ధారణ అయిపోయాడు.

"అవధాన్లు హెచ్చరిక చేసినపుడే రామయ్య మేలుకొనివుంటే ప్రమాదం తప్పివుండేది" అని ఎట్టకేలకు పిచ్చయ్య వ్యాఖ్యానించాడు.

"నీదంతా పిచ్చిగాని కరణంగారూ! ఎలా రాసిపెట్టితే అలా జరిగి తీరాల్సిందే" అని అవధాన్లు కొట్టిపారేశాడు.

మొత్తానికి పెద్దమనుషులు జోక్యం లేకుండా సుబ్బయ్య విషయం సులభంగా పరిష్కారమైనందుకు మనసులో సంతోషించాడు. అంతటితో వెళ్లిపోతేనే భాగ్యమనుకున్నాడు.

♦ ♦ ♦

ఆవేళ పొద్దుగూకాక అవధాన్లు యింటికి చేరుకొంటూనే భార్య కంగారుగా ఎదురొచ్చింది.

"చూశారా మనవాడు యింతవరకు యింటికి రాలేదు."

"వస్తాడులేవే. వాడేమైనా చిన్నవాడా, చితకవాడా - షికారుకు వెళ్లాడేమో తిరిగిరాడూ" అని ధైర్యం చెప్పాడు అవధాన్లు.

పొద్దుట్నుంచీ అంతులేదు. చీకటితో ఎప్పుడు లేచి వెళ్లాడో. మధ్యాహ్నం భోజనానికి రాలేదు... ఎక్కడికి వెళ్లినట్టు!! భార్య కొడుకోసం బెంగపెట్టుకుంది. భార్య గందరగోళం విన్నాక అవధాన్లు కూడా మెత్తబడిపొయ్యాడు. నిజమే...చీకటితో వెళ్లాల్సిన పనేముంది వాడికి?

అవధాన్లు కొడుకు జగన్నాధం మెడ్రాసులో బి.ఎ. చదువుతున్నాడు. పరీక్షలు రాశాక సెలవుల్లో వూరికొచ్చాడు. అవధాన్లు కొడుకు చిన్నప్పట్నించి అదోరకం మనిషి. పిఱికి గుండె..ఒకరి జోలికి పోడు. చదువంటే యిష్టం. అది అతని లోకం. అతనంటే ఆ వూళ్లో చాలమందికి యిష్టం. భవిష్యత్తులో మంచి ప్రయోజకుడౌతాడని వూళ్లో అందరూ అనుకొనేవారు.

జగన్నాధం మెడ్రాసులో చదవటం మొదలెట్టాక చాలా మారిపొయ్యాడు. అందరితో కలిసి మెలసి మాట్లాడటమూ, అతనికిష్టంలేని విషయాలను ఖండించటమూ ఆచరణలో పెట్టుతున్నాడు. పిఱికితనం మాయమై, కలుపుగోలుతనము హెచ్చింది.

అయితే అటువంటివాడు ఈమధ్య సుబ్బయ్యతో స్నేహం చెయ్యటం చాలమందికి యిష్టంలేకపోయింది. అందుమీదట తన్ను కొందరు ఏవగించుకొన్నమాటా నిజమే! అతనితోబాటు మునసబు కొడుకు రాంబాబు, పిచ్చయ్య పుత్రుడు నారాయణ ఈ జట్టులో చేరటం చాలామందికి ఆశ్చర్యం కలిగించింది.

మునసబుగారి అబ్బాయికి ఆ మధ్య ఇంటర్మీడియెట్ మొదటి సంవత్సరంలోనే మంచి పెళ్లిబేరాలు వచ్చిపోయినయ్. పదివేలకు మించి రేటు పెరిగిందని అనుకున్నారు. అప్పట్లో ఆలస్యమైపోయింది గాని — ఇప్పుడు రాంబాబు ససేమిరా కట్నం వొద్దంటున్నాడని — వినికిడి.

ఈమార్పు కంతటికీ జగన్నాధంతో స్నేహమే కారణమని కొందరనుకున్నారు. కాని నిజానిజాలు ఎవరికీ తెలియవు.

బాగా చీకటిపడ్డా జగన్నాధం ఇంటిముఖం పట్టక పోయేసరికి అవధాన్లు ఆందోళనపడ్డాడు. ఎకాఎకీ మునసబుగారింటికి పరుగెత్తి విషయం చెప్పాడు.

చిత్రమేమిటంటే మునసబుగారుకూడా వాళ్ల కొడుకోసం ఎదురు చూస్తున్నాడు. పిచ్చయ్య వాళ్లబ్బాయికూడా పొద్దుట్నుంచీ పత్తాలేదని సూచాయగా తెలిసింది. ఇంకేం ముగ్గురు కలిసి ఎక్కడికో వెళ్లుంటారనుకొన్నారు. పొలాల్లో పురుగూ పుట్రా తిరిగేవేళ అది. లాంతర్లిచ్చి వెట్టివాళ్లను - వేద్యగాళ్లను తలోమూలకి తరిమారు వెదకటానికి. ఆవేళ ఎంత ప్రయాసపడ్డా వాళ్లజాడే తెలియలేదు. ఎక్కడికి పోయారో వీళ్ళు.

సుబ్బయ్యమీద అనుమానం తగిలి, పోలీసురిపోర్టు యిస్తే బాగుణ్ను అన్నాడు సుబ్బారాయుడు. పోలీసులు గ్రామంలో అడుగుపెట్టడం యిష్టంలేక మునసబు వొద్దన్నాడు. ఆరాత్రి అలాగే గడిచి పోయింది.

◆ ◆ ◆

ప్రొద్దున్నే కర్ణకఠోరంగా ఒకవార్త శరవేగంతో వ్యాపించింది వూరంతా. అదేమిటంటే, లక్ష్మి సుబ్బయ్యతో లేచిపోలేదట!

"అవధాన్లు కొడుకు లక్ష్మిని పెళ్లి చేసుకున్నా" డని, సుబ్బయ్య ఈ విషయంలో కేవలం మధ్యవర్తే నట!

"లక్ష్మి మన యింటికి తగినకోడలు. మమ్మల్ని దీవించు నాన్నా" అని జగన్నాధం తండ్రి పాదాలకు మ్రొక్కాడు.

అవధాన్లు చర్రున మండిపోతూ "ఛీ! చండాలుడా! నా కడుపున చెడబుట్టావ్!!" అని కొడుకుని మెడబట్టుకు నెట్టి, భార్యను వెనక్కీడ్చి తపీమని తలుపులు వేసుకున్నాడు. జగన్నాధం లక్ష్మిని తీసుకొని వెనక్కువచ్చాడు. బైట సుబ్బయ్య, రాంబాబు, నారాయణతో సహా ముసిముసినవ్వులు నవ్వుకొంటున్నారు.

ఆరోజునే వూళ్లో "వరకట్న నిషేధసంఘం" అనే యువక సంఘానికి ప్రారంభోత్సవము జరిగింది. దానికి అధ్యక్షుడు జగన్నాధం. సెక్రటరీ మునసబుగారబ్బాయి.

మునసబుగారికి తల దిమ్మెక్కిపోయింది. అవధాన్లు అంతులేదు. సుబ్బారాయుడికి మతిపోయింది. ఇక పిచ్చయ్య మాట సరేసరి. పాపం రచ్చబండ.....!!!




# సాహసవీరులు

**శ్రీ కానాధిభట్ల వెంకటసుబ్బారావు**

( గతసంచిక తరువాయి )

## (6)

హారకుమార్‌కు స్మృతివచ్చి చూచేసరికి ఒక దివ్య భవనందాపున పడివున్నాడు. లేచి కూర్చుని ఒళ్లు నలుపుకుని అటూ ఇటూ చూశాడు. ఎదురుగా దివ్య భవనం. దాని నానుకునే ఒక వుద్యానవనం! అతడు సరాసరి ఆ భవనంలోకి వెళ్లాడు. భవనం ప్రతిఒక్క గదీ గాలించాడు. కాని ఎక్కడా నరసంచారం జాడ అగుపించలేదు! అంతా నిశ్శబ్దంగా వుంది! చివరకు అతడు వుద్యానవనంలోకి వచ్చాడు. అక్కడకూడా మానవసంచారం జాడ అగుపించలేదు. ఆ వింతవాతావరణంలో అతడు తిరుగాడుతూ చివరకు ఒక గులాబీ చెట్టు దగ్గరకు వచ్చాడు. గులాబీ పుష్పాన్ని కోద్దామని చేయి మీద వేశాడు. ఆశ్చర్యం! చెట్టుకుదురు మొత్తం కదిలి అవతలకు పోయింది! కుదురులోపల దారి అగుపించింది. ఇంకా వింతపోతూ అతడు ఆ దారిగుండా నడిచి చిట్టచివరకు ఒక పంచరంగుల భవనాన్ని చేరుకున్నాడు. ఆ భవనంయొక్క అందానికి అబ్బురపోతో ఒక గదిలోకి వచ్చాడు. ఆ గదిలో నాలుగు పట్టెమంచాలు వేసివున్నయ్. చివరి పట్టెమంచంమీద బోర్లాపడుకొని ఒకయువతి వెక్కి వెక్కి ఏడుస్తోంది.

హారకుమార్ లోపలకు అడుగు పెట్టగానే ఆమె ఒక్కసారి వుల్కిపడి లేచింది.

"ఎవరు మీరు? ఇలా ఎందుకు వచ్చారు?" అంటూ ప్రశ్నలవర్షం కురిపించింది.

తాను ఏవిధంగా అక్కడికి వచ్చిందీ వివరంగా చెప్పాడు.

"అయితే ఇందాక నిన్ను నదీ అంతర్భాగంలోకి లాక్కు వచ్చిన చెయ్యి ఎవరిదో తెలుసా! మా పెద్దక్క లీలది. నీవు మాకో సాయం చేసిపెట్టాలి!" అంది.

"తప్పకండా నూ, ఏం సాయం కావాలి?"

"మాకథ వింటే నీకు ఆశ్చర్యం కలుగవచ్చు. మేం నలుగురు అప్పచెల్లెళ్లం. నాపేరు సుశీల. చిన్నక్క పేరు విమల. మూడో అక్క పేరు సుమతి. పెద్దక్క పేరు లీల అని ఇదివరకే చెప్పాను కదా! మా తండ్రి వినుతుడు అనే గంధర్వుడు. మేం ఒకసారి భూలోకంలోకి షికారుగా వచ్చాము. ఎక్కడనుండి వచ్చాడో రాక్షసుడు మా మీదికి విజృంభించి మమ్మల్ని గులాబీలుగా మార్చేశాడు. మా తల్లి దండ్రులు మేము ఎంతకూ ఇంటికి రాకపోయేసరికి విచారంతో అక్కడక్కడ వెతుకుతూ భూలోకానికి వచ్చారు. ఈ ఉద్యానవనం దగ్గరకు వచ్చేసరికి రాక్షసుడు తోటమాలి రూపంపొంది మా తల్లిదండ్రులను వంచించి తోటలో గులాబీపూలుగా మార్చివేశాడు. తరువాత మమ్ములను నిజరూపులనుజేసి వివాహం చేసుకొమ్మని బలవంతం చేస్తున్నాడు. దినదినగండంగా గడుపుతున్నాం. మా లీల ఎలాగైతేనేం మమ్మల్ని ఇక్కడ లాక్కొచ్చింది. మమ్మల్ని రక్షించే భారం నీది!' అంది.

"మరేం కంగారుపడకు! మిమ్మలను రక్షించే భారం నాది!"

"జాగరూకతతో మెలగాలి సుమా! ఈ రాక్షసుడు సామాన్యుడు కాదు. వీడిపేరే వికటాట్టహాసుడు. వీడు ప్రతిదినం వూరిమీదికెళ్లి సాయంత్రానికల్లా కొంపకు చేరుకుని మమ్మల్ని వేధిస్తుంటాడు! ఇంకొక విశేషం ఏమిటయ్యా అంటే, ఈ భవనానికి మూడు మైళ్ల దూరంలో ఒక మదపుటేనుగు

వుంది. దాన్ని బంధించితే రాక్షసుని ఆయువుపట్టు శీఘ్రంగా కనుగొనవచ్చును. దానిని బంధించలేక నే ముగ్గురు రాకుమారులు బలియైపోయారు" అంది.

హారకుమార్ ఆమెకు ధైర్యంచెప్పి ఏనుగున్న దిశగా బైలుదేరాడు. అతనిని చూసీచూడటంతోటే ఏనుగు పరుగునవచ్చి మీదికి దూకింది. హారకుమార్ దానిమీదికి లంఘించి పిడిగుద్దులు గుద్దాడు. కాని ఏనుగు లొంగలేదు. వెంటనే అతడు ఏనుగు మెడలోనున్న హారాన్ని పట్టుకున్నాడు. చిత్రమేమంటే, హారం పట్టుకోగానే అంతిబలం కలిగిన ఏనుగు కుక్కలా మెత్తపడిపోయింది.

ఆ ఏనుగు మానవభాషలో - "బాబ్బాబు! ఆ గొలుసు వదిలిపెట్టు; నీవేదికోరితే అది ఇస్తాను" అంది.

హారకుమార్ కిటుకు అవగాహన చేసుకున్నాడు.

"రాక్షసుడి ప్రాణం ఎక్కడుందో చెప్పు!" అడిగాడు.

"అదిమాత్రం నావల్ల కాదు."

"అయితే గొలుసు తెంపేస్తాను!"

"బాబ్బాబు విను చెప్తాను!" అని ఒక్కసారి ఆవలించింది. అందులోనుంచి బంగారుగుడ్డు క్రింద పడింది - "ఇది వాడిప్రాణం! అంది.

ఈ సంగతి వికటాట్టహాసుడు తెలుసుకొని పరుగెత్తుకు వస్తున్నాడు.

రాక్షసుడు వచ్చేలోగా గ్రుడ్డును త్రొక్కిపారవేశాడు. రాక్షసుడు విలవిలలాడుతూ ప్రాణం వదిలాడు.

"ఇక వదులు నన్ను." అంది బ్రతిమాలుతూ ఏనుగు.

"అప్పుడేనా! గులాబీ పుష్పాలుగా మారిన ఆ గంధర్వ దంపతులు తిరిగి నిజరూపం పొందటానికి మార్గమేమి?" అడిగాడు.

"ఆ కనపడే అమృతవృక్షపు ఆకులపసరు వ్రాస్తే నిజరూపు కలుగుతుంది!"

"అలాగా" అని గొలుసు త్రెంపాడు. ఏనుగు కాస్తా రాక్షసిగామారి ప్రాణాలు వదిలింది.

హారకుమార్ అమృతవృక్షం ఆకులను తీసుకొని ఉద్యానవంలోకి వెళ్లాడు. గులాబిచెట్టునవున్న పుష్పములకు వాటిపసరు రాయగానే గంధర్వ దంపతులుగా మారిపోయారు. ఇంతలో నలుగురు అప్పచెల్లెళ్లు పరుగుపరుగున అక్కడికి వచ్చారు. వారు తమ తలిదండ్రులకు అతని వృత్తాంతం చెప్పారు. ఆ గంధర్వ దంపతులు ఆనందంతో యువరాజుని ఆలింగనం చేసుకుని - "నిజంగా నీ ఋణం ఎన్ని జన్మలు ఎత్తి అయినా తీర్చుకోలేం. నీకు చేయగలిగిన ప్రత్యుపకారం ఈ కన్యలనిచ్చి వివాహం చేయటమే" అన్నారు.

ఆ కన్యలు సిగ్గుతో నిలబడ్డారు. తరువాత వారందరి ఆహ్వానంపై గంధర్వ లోకానికి వచ్చాడు. గాంధర్వ విధుల ప్రకారం హారకుమార్‌నకు లీలా, విమల, సుశీల, సుమతిలతో బ్రహ్మాండంగా వివాహం జరిగింది.

హారకుమార్ ఆ యువతులతో రంగరంగ వైభోగాలనుభవించాడు. కొన్నిదినములు గడిచిన తరువాత మామగారితో తను తిరిగి వెళ్లిపోవాలని చెప్పాడు. ఆయన - ఎక్కడికి! - అని అడిగాడు ఆశ్చర్యంతో

"నా ఆప్తుడు శివబంటు అని ఒకడున్నాడు. అతనూ, నేనూ ఒకేసారి బయలుదేరాం. కాని మధ్యలో ఇద్దరం చెరికదారి అయిపోయాం. అతని కోసమైనా వెళ్లితీరాలి!" అన్నాడు.

మామగారు చివరకు అంగీకరించారు. తర్వాత తన భార్యలతో - "మీరేం దిగులు పెట్టుకోకండి! అతను దొరకగానే శీఘ్రమే మీవద్ద వాల్తాను!" అని వారిని బుజ్జగించి బయలుదేరాడు.

అలా హారకుమార్ బయలుదేరి పల్లెపల్లెలూ, పట్నాలూ గాలిస్తూ చివరికి ఒకవూరు చేరుకున్నాడు, అప్పటికి బాగా చీకటిపడిపోయింది. ఆరాత్రి ఎక్కడైనా తలదాచుకుని తిరిగి మర్నాడు బయలుదేరుదామని నిశ్చయించుకొని ఒక ఇంటికివచ్చి తలుపుతట్టి- "అమ్మా!" అని పిలిచాడు.

గంతేసి తలుపుతీసి - "ఎవరు?" అంది.

"అమ్మా! బాగా చీకటిపడింది. ఈరాత్రి బయట అరుగుమీద పడుకుంటాను చాప యిప్పించండి." అని అడిగాడు,

ఇంతలో లాంతరు తీసుకుని గృహస్తుడు బైటకొచ్చాడు. ఆ గృహస్తుని చూడగానే హారకుమార్ గుర్తించాడు - "శివబంటూ!" అని కౌగలించుకున్నాడు.

(సశేషము)

# స్వామి కేశవయ్యాజీ బాబాసందేశ ప్రచారపర్యటన

—(౦)—

శ్రీ స్వామి కేశవయ్యాజీ శ్రీ సాయిబాబా దివ్య సందేశమును ప్రచారము చేయుటకు, బాబా అనుగ్రహ కటాక్షములను, విభూది ప్రసాదములను భక్తులకు పంచిపెట్టుటకు పర్యటనకు బయలుదేరి ఫిబ్రవరి 11వ తేదీన ఆదోని చేరారు. అచ్చట ప్రముఖ ప్రత్తి వ్యాపారులు, ద్వారకా టాకీస్ యజమానులగు శ్రీ H. C. మాణిక్యరెడ్డి, ధర్మారెడ్డిగారలు యింకా అనేకమంది అధికార అనధికార ప్రముఖులు, భక్తులు ఆయనకు స్వాగతమిచ్చారు.

సోమవారము నాడు 'శ్రీ వెంకటేశ్వర మహాత్మ్యం' చిత్రప్రదర్శన ప్రారంభోత్సవమునకు స్వామీజీ అధ్యక్షత వహించారు. వారు తమ ప్రారంభోపన్యాసంలో "శ్రీ వెంకటేశ్వరస్వామి, శ్రీ సాయిబాబా బహు సన్నిహిత సంబంధము కలవారు, దానిని కొందరు అజ్ఞానముచే తెలిసికొనలేకున్నారు. శ్రీ వెంకటేశ్వరుని మొక్కుబడులనుతీర్చ మరచినవారిని శ్రీ సాయిబాబా ఆశీర్వదించడు. ముందొకసారి ఒక వర్తకుడు తన కోడలికి సంతానము కలుగునట్లు ఆశీర్వదించవలసినదిగా నన్ను కోరాడు. నేను ఆయన షిర్డీకిపోయి వచ్చినచో కర్మవిమోచనము కాగలదని చెప్పితిని. ఆ వర్తకుడాలాగే షిర్డీకిపోయి కుటుంబసమేతంగా మూడు రోజులచ్చటుండి శ్రీ సాయిబాబా నారాధించి వచ్చాడు. ఆయన మరల నన్నువచ్చి చూడగా నేనాయన కోడలి నుదుట విభూదినుంచి, ఆమెతల్లి శ్రీ వెంకటేశ్వరునికి కూతురి తలవెంట్రుక లిచ్చునట్లు మొక్కుకొని అట్లివ్వలేదంటిని. ఆ వర్తకుడు సాష్టాంగపడి తాను షిర్డీలో నుండగానే అట్టి స్వప్నము కలిగెనని చెప్పి, తిరుపతికి మొక్కు తీర్చుకోడానికి బయలుదేరి వెళ్లారు. తర్వాత ఆయన కోడలికి సంతానప్రాప్తి యయింది"

"ఇదేవిధంగా అనేకమంది భక్తులకు శ్రీ సాయిబాబా తోడ్పడ్డారు. శ్రీ వెంకటేశ్వరస్వామి సయితము అజ్ఞానాంధకారమునుండి మానవుల నుద్ధరించుచుండును. శ్రీ వెంకటేశ్వరస్వామి కరుణా కటాక్షములు అపారములు. ప్రార్థించిన వారందరికి సులభంగా స్వామి సహాయం లభిస్తుంటుంది. భగవాన్ భక్తుల రక్షించుటకు అత్యంతాసక్తి చూపుతుంటాడు. తొండమాన్ రాజ్యపాలన సాగించుచున్న కాలంలో ఒకప్పుడు ఒక బ్రాహ్మణుడు కాశీకి పోతూ తన భార్యను, బిడ్డలను కాపాడుచుండవలసినదిగా రాజుకు ఒప్పగించి వెళ్లాడు. రాజు సమ్మతించి వారికి నివాస భోజనవసతుల నేర్పాటుచేసెను. 6 నెలల తరువాత వారినిగురించి మరచిపోగా బ్రాహ్మణుని భార్యాబిడ్డలు ఆకలిదప్పుల కలమటిస్తూ చనిపోయారు. రెండు సంవత్సరముల తర్వాత బ్రాహ్మణుడు తిరిగిరాగా అతనిని చూడగానే రాజు అయోమయావస్థలో పడి భయముతో నిర్జీవుడైపోయాడు. వెంటనే శ్రీ వెంకటేశ్వరుని కాళ్లమీదపడి శరణువేడాడు. శ్రీ స్వామి అతనిని కరుణించి అతడు భక్తుడగుటచే అతని నడతకు తనే కారణమంటూ చనిపోయినవారి అస్థిపంజరముల తెప్పించి, వానిని ఒకసరస్సు సమీపమునకు చేర్చి, అందలి జలమును వారిపై చల్లెను. బ్రాహ్మణుని భార్య, బిడ్డలు బ్రతికిరి. శ్రీ స్వామి కరుణా కటాక్షములను అనుభవించగలమే కాని వర్ణించలేము. ద్వారకా టాకీస్ యజమానులు యీ చిత్రప్రదర్శన ప్రారంభోత్సవానికి నాకవకాశమిచ్చినందులకు కృతజ్ఞుడను" అని ప్రారంభోత్సవము జరిపిరి.

ఆ సాయంకాలము శ్రీ H. C. మాణిక్యరెడ్డిగారి యింట్లో శ్రీ సాయిబాబా ఆరాధనార్చనలు జరిగెను. అనేకమంది భక్తులు దర్శనమునకు వచ్చిరి. వారికి స్వామి కేశవయ్యాజీ విభూది ప్రసాదములను పంచిపెట్టారు. అనేకమంది తమ జీవితసమస్యలను స్వామీజీకి నివేదించి పరిష్కార మార్గాలను తెలిసికున్నారు. పూజ 6 గంటల నుండి రాత్రి 11 గంటల దాక జరిగి షుమారు 1000 భక్తులు పూజారాధనలలో పాల్గొన్నారు.

సోమవారంనాడు బళ్లారిలో మాజీ మద్రాసు మంత్రి శ్రీ H. సీతారామరెడ్డిగారి యింట్లో స్వామీజీ పూజ జరిపారు. అక్కడ అనేకమంది భక్తులకు విభూది ప్రసాదములను, తీర్థమును పంచిపెట్టారు.

స్వామి కేశవయ్యాజీ పర్యటన సందర్భమున ప్రతిచోట అనేకమంది భక్తులు గుమికూడి దర్శనము చేసిరి. వారికి స్వామీజీ బాబా బోధనల ననుసరించి, ఆరాధించి సత్ఫలితాలను పొందవలసిందిగా ఉద్బోధించారు.

ఆదోనినుండి మద్రాసుకు బయలుదేరిన సందర్భమున పెక్కుమంది వీడ్కోలిచ్చిరి. గుంతకల్లు రైల్వే స్టేషనులో అనేకమంది భక్తులు స్వామి కేశవయ్యాజీ దర్శనమునకు, ఆయన విభూది ప్రసాదముల కొరకు కనిపెట్టుకొనియుండిరి. వారందరు సాదరముగా ఆశీర్వదింపబడిరి.




భారతమాత దండకము: శ్రీ చర్ల లక్ష్మీనారాయణ. ప్రకటనకర్త శ్రీ ఆకుండి వేంకటశాస్త్రి, 'కీర్తిసదనము,' కాకరపఱ్ఱు, (వయా) తణుకు, ప. గోదావరిజిల్లా. వెల 12 నయాపైసాలు.

ఈ దండకము నడక సరళముగానుండి ప్రాథమిక, మాధ్యమిక పాఠశాల విద్యార్థులు పఠించుట కనువుగానున్నది. ఇందులో జాతీయౌన్నత్యమును, విశిష్టతను స్మరించుటకవకాశము కల్పించబడినది. భావసంపద సులభగ్రాహ్యము.

శ్రీ అమృతాభిషేకము: శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి. ప్రచురణకర్తలు - శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల, హిందూపురము, అనంతపురంజిల్లా. వెల రు. 1-25.

ఇందులో ఆంధ్రాభ్యుదయము, వెన్నెలతీగలు, ఋతులక్ష్మి మూడుభాగములు మొత్తం 42 శీర్షికల క్రింద వివిధ విషయములపై రచన సాగింది. ఇందలి పద్యములు, గేయములుకూడ చక్కని భావరసభరితములై పాఠకులను పులకితులను చేయునవి. గ్రంథకర్త కవితారీతులు అభ్యుదయ కవులకు మార్గదర్శకము కాతగినవి.

మహారథికర్ణ (సినిమాకథ) మా కార్యాలయమునకు చేరినది. ప్రచురణకర్తలు: శ్రీ గోపీకృష్ణ ఫిలిమ్స్, మద్రాసు 24. వెల 40 న. పైసాలు

ధనలక్ష్మి ప్రొడక్షన్స్ సమర్పించు 'మహారథి కర్ణ' చిత్రంయొక్క గాథ. ఇందులో కథాగమనాన్ని అనుసరించిన సంభాషణలు, పాటలు, పద్యాలు, ఛాయాచిత్రాలున్నవి. భారతయుద్ధగాథయగుటచే విశేషంగా ప్రజాదరణ పొందగలదని చెప్పవచ్చును.

◆ ◆ ◆

రాజమండ్రి దివ్యజీవన సంఘం శాఖ తొమ్మిదవ వార్షికోత్సవ సందర్భమున శ్రీ స్వామి శివానంద పంపిన సందేశము. ఆంధ్రప్రదేశ్ హరేరామ సంఘము (ఇనుమడుగు, నెల్లూరుజిల్లా)కు పంచమ శ్రీ రామనామ మహోత్సవముల సందర్భమున శ్రీ స్వామి శివానంద పంపిన సందేశము రెండు చిన్న పుస్తక రూపములలో మా కార్యాలయమునకు చేరినవి.

దివ్యజీవనమునుద్దేశించి అనుక్షణం మానవజీవయాత్రలో స్వామి శివానందభగవాన్‌ల మార్గదర్శకత్వము యీ రెండు సందేశములద్వారా ప్రతిఫలించుచున్నది. ఇహపరములలో సుఖసౌభాగ్యముల ప్రసాదించి శ్రీ స్వామి శివానందయొక్క బోధనలు మనకు యిట్టి సందేశములద్వారా సయితము లభించుచుండుట మహాభాగ్యము.